# భావన



నూరు అంశాలపై
దాదాపు ఐదువందల
సుభాషితాల సంకలనం

ప్రచురణ

రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# BHAAVANA

A COLLECTION OF QUOTATIONS



**యువభారతి**

ప్రచురణ: 29

ప్రథమ ముద్రణ: 3,200

1 డిసెంబర్, 1974



ముఖచిత్ర రచన:

శీలా వీర్రాజు

ముద్రణ:

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ:

విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు:

**యువభారతి**

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాదు—500001.

వెల: రూ. 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDI AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL

# మా మాట

"ఒక పద్యం చదివి నీకెంతజ్ఞానం అబ్బిందో తెలుపుతావా?" అని ప్రహ్లాదుణ్ణి తండ్రి అడిగినాడట. అంటే 'సారభూతమైన జ్ఞానాన్ని ఒక్క మాటలో చెప్పు' అని అర్థం. ఎంతో గంభీరమైన, ఎంతో విస్తృతమైన, ఎంతో మనోహరమైన మాట సూక్తి అనిపించు కుంటుంది. మహితాత్ముల ఆలోచనా సుధారాశిలోంచి కొన్ని మణులను వెలికి తీసి, పఠితృలోకానికి అందజేయాలని, ఒక బృహత్తర ప్రణాళికను యువభారతి సిద్ధం చేసింది. ప్రాచ్యపాశ్చాత్య భావప్రపంచాన్ని ప్రభావితం చేసి ఉద్దీప్తం చేసిన మహామనీషుల సూక్తులను క్రోడీకరించి, ఆరువందల పేజీల పెద్ద సంపుటాన్ని వెలువరించాలనే మా ఉద్దేశ్యానికి ఈ భావన తొలిరూపం — త్వరలోనే ఆ పెద్ద సంపుటాన్ని అందించగలమని ప్రకటించడానికి ఎంతో సంతోషంగా వుంది.

భావనలోని సూక్తులు ఎన్నో గ్రంథాలనుంచి పత్రికల నుంచి గ్రహించబడినవి. కొన్ని ఇంగ్లీషు వాక్యాలకు మేము చేసిన అనువాదాలున్నవి. ఇదివరకే ఉన్న అనువాదాలను యథాతథంగా తీసికొన్న సందర్భాలు ఉన్నవి. ప్రాచీన అర్వాచీన కావ్యాల నుంచి కూడా సూక్తులను ఏరుకున్నాము. ఈ సంకలనంలో నూటికి మించిన శీర్షికలున్నవి. సూక్తులు వివిధరంగాల్లోని వివిధ అనుభవాలకు సంబంధించినవి. ఒకే అంశాన్ని గూర్చి పరస్పర విరుద్ధమైన సూక్తులు ఇందులో కనపడవచ్చు. ఏమైనా అవి అనుభవజ్ఞులు కాచి వడబోసి చెప్పిన పరమ సత్యాలు. ఈ ఏర్పు కూర్పుల బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకొని, నిర్వహించిన మా సహసమావేశకర్త డా. నాగినేని భాస్కరరావును అభినందిస్తున్నాము. చాలా ఓపికతో సమర్థతతో ఈ ప్రణాళికను చేపట్టి పూర్తిచేయ గలిగారు.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడం లోను యథోచితంగా తోడ్పడి తమ శక్తియుక్తులను, ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

1-12-1974 అధ్యక్షుడు

# ప్రేరణ

విశ్వకళ్యాణమే ధ్యేయంగా, సర్వమానవ సౌభ్రాత్రమే లక్ష్యంగా పెద్దఎత్తు
కృషిజరగవలసిన అవసరం, నేడున్నంతగా బహుశః ఇంతకుముందెప్పుడూ లేదేమో
బహుముఖ ప్రజ్ఞాశాలురైన వ్యక్తులు, ఏకోన్ముఖులై, నిశ్చలచిత్తంతో, నిరంతరకృ
సలుపవలసిన తరుణమిది. ఈ బృహత్తర మహత్కార్యంలో సంస్కారవంతులై
విద్యాధికులపాత్ర ఎంతైనా ఉంది. ఎందుకోమరి, చాలామంది పట్టించుకోరు; అసం
ఈ విషయాల గురించే ఆలోచించడానికే పూనుకోరు. ఎవరైనా ఈ విషయాల ప్రస్తా
వన తీసుకువస్తే గుర్తుకు తెచ్చుకోరు సరికదా-నిరసిస్తారు; నిరుత్సాహపరుస్తార
విద్యావంతులను ఇలానే ఉండనిస్తే, జాతి ప్రగతికే ప్రమాదం వాటిల్లుతుంది.

"It is with books as with men :
a very small number play a very great part."

అత్యవసర ప్రాతిపదికపై, అందరినీ అక్షరాస్యులను చేయడానికి పూనుకోవాలి
అక్షరాస్యులను, విద్యావంతులుగా-విద్యావంతులను, సంస్కారవంతులుగా తీర్చిదిద్దే
దుకు నిరంతర కృషి అవసరం. కులం పేరిట, ధనం పేరిట, భాష పేరిట, జాతి పేరిట
మతం పేరిట, అభిమానం పేరిట, రాష్ట్రం పేరిట, దేశం పేరిట స్వార్థపరులు సృష్టించి
దుర్భేద్యంగా కనిపించే అడ్డుగోడలు నిజానికి కేవలం ఒట్టిరేఖలని, చెరిపివేసుకోవలసి
గీతలు అనేభావం ప్రతిఎదలో మార్మోగాలి; ప్రతిఆలోచనకు ప్రాణంపోయాలి; ప్ర
గొంతు ఘోషించాలి; ప్రతిమాటలో ప్రతిధ్వనించాలి; ప్రతిచేతలో ప్రతిఫలించా
ప్రతిధ్యేయంలో ప్రస్ఫుటమవ్వాలి; ప్రతికావ్యంలో ధ్వనించాలి; ప్రతికార్యంలో
ఫలించాలి.

సమాజంలో సౌజన్యం పెంపొందడానికి నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్య
లభించడానికి, సామాజిక స్పృహ కలగడానికి సాహితీవేత్తలు పూనుకోవాలి. ప్ర
మనిషి మానవత్వపు విలువలను మన్నించే మహామనీషిగా మారడానికి అవసరమై
ప్రేరణనందించాలి. పుస్తకాలు, తదితర ఆధునిక ప్రచార, వినోద, సాధనాలద్వార
ఉద్యమవేగంతో ఈ కృషి జరగాలి. స్వార్థప్రేరణల సందడి అణగి, సేవానిరతి వెలు
విస్తృతం కావాలి. సాహిత్యాన్ని ఆదరించే నాగరికత ఇది సాధించగలుగుతుంది
పుస్తకాలను చదివి చేతలకు పూనుకొనే మనుష్యులే ఇది సాధించగలుగుతారు. ఆలో
నకు స్వేచ్ఛనిచ్చి, నిర్మాణాత్మక కృషికి ప్రేరణనిచ్చే వాతావరణం ప్రజాస్వామ్య
లోనే లభిస్తుంది.

"I love and honour Learning; if rightly used, it is the noblest and most powerful human acquisition" —Montaigne

అందుకే ఆలోచనలు ముఖ్యం. పెద్దపెద్ద పుస్తకాలు సాధించలేని పనిని-చిన్నచిన్న పుస్తకాలు చేయగలుగుతాయి. గొప్పగొప్ప గ్రంథాలకన్న చిన్నచిన్న సూక్తులే - మనసుకు సూటిగా తగిలి, మేధకు ప్రేరణ కలిగించి, మంచివైపు దూకేలా ముందుకురికించేలా చేస్తాయి. "పదండి ముందుకు... పదండి తోసుకు... పోదాం పోదాం పైపైకి"

"Literature always anticipates life. It does not copy it but moulds it to its purpose" —Oscar Wilde

100 కి పైగా విషయాలను అకారాదిగా ఏర్పరచి, దాదాపు 500 ఆలోచనలను-విజ్ఞానఖనుల అనుభవాల సారాన్ని భావనపేరిట అక్షరాల పేటికలుగా చేర్చాము.

కేవలం చదవడమే కాదు - దయచేసి ఆలోచించండని విన్నవిస్తున్నాము. కేవలం ఆలోచించడమే కాదు, చేతనైన మంచి ఏ కాస్తయినా చేయడానికి పూనుకోండని అర్థిస్తున్నాము. మీ తీరికసమయంలో కాస్సేపు-చదవడానికి తప్పకుండా వినియోగించండి. ప్రతిరోజు కనీసం ఒక్క పేజి అయినా కొత్తపుస్తకం నుండి చదువనిదే ఆరోజుకు సార్థకత చేకూరలేదని, మీరు సంస్కారవంతులైన విద్యావంతులైనందుకు సాఫల్యం లేదనీ, ఇది కనీస కర్తవ్యమనీ, రోజుకొక్క ఐదునిముషాలకు మించి అవసరముండదనీ, ఈ మాత్రమైనా చేయడానికి దృఢనిశ్చయంతో పూనుకోకపోతే మరింకేం చేయగలమని ప్రశ్నించుకోండని, సమాధానం అన్వేషించండని, కార్యోన్ముఖులుకండని బరువైన హృదయంతో, సజలనేత్రాలతో విన్నవిస్తున్నాము. భారతమాత ఆశతో మీ కళ్ళవైపు చూస్తున్న విషయాన్ని కనులుతెరచి చూడండని ప్రార్థిస్తున్నాము. "నేనొక్కడినీ ఏంచేయగలనని"- నీరుకారిపోకుండా... చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని ఊరికే తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించడానికి పూనుకోండని అర్థిస్తున్నాము.

ఈ పుస్తకం గురించి మీ అభిప్రాయాన్ని రాయడం మరువకండి. ఇలాంటి పుస్తకాల అవసరంపై, మీ సూచనలు తెలుపండి. చేతనైనంతమేరకు కృషిచేస్తున్న యువభారతీయులకు మీ సహకారాన్ని అందించండి. మేం చేస్తున్న కృషి నచ్చితే- మీ మిత్రులకు యువభారతిని పరిచయం చేయండి.

ప్రజాహృదయ వేదికే వేదికగా ఈ జాతికి సేవచేయాలనేదే మా కోరిక.
ఈ సంకల్పంలోని బలమే, మంచితనమే మాకు శ్రీరామరక్ష.

మీ సహకారాన్ని అర్థిస్తూ

1-12-1974 సమావేశకర్త, యువభారతి.

# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 32 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. ఈరోజు నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దాలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 450 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ —

ఇరివెంటి కృష్ణమూర్తి

1-12-1974 అధ్యక్షుడు

భావన

# అనుక్రమణిక

45; ధర్మం
46. నాగరికత
47. న్యాయం
48. నీతి
49. నేరము-శిక్ష
50. పగ
51. పఠనం, పుస్తకం
52. పత్రికలు, వార్తలు
53. పరలోకం
54. పరోపకారం
55. పుట్టుక, చావు
56. పొదుపు
57. ప్రజలు
58. ప్రజాస్వామ్యం కమ్యూనిజం
59. ప్రపంచం
60. ప్రభుత్వం
61. ప్రవర్తన
62. ప్రేమ
63. బాధ్యతలు
63. బాల్యం
65. భక్తి
66. భయం
67. భాష
68. భౌతికవాదం
69. మతం
70. మేధావి
71. మోసం
72. మోహం
73. మోక్షం
74. మౌనం
75. యువతి
76. యౌవనం
77. రాజకీయాలు
78, లోభత్వం
79. వార్ధక్యం
80. విద్య
81. వివాహం
82. వృత్తి, ప్రవృత్తి
83. వైరాగ్యం
84. వ్యక్తిత్వం, గుణాలు
85. వ్యసనాలు
86. వ్యాధులు, వైద్యం
87. శత్రువు
88. శాంతి-సమరం
89. సత్యం
90. సంఘం
91. సంతోషం
92. సంప్రదాయం
93. సంభాషణ
94. సంస్కరణ
95. సృష్టి
96. సహనం
97. సాహిత్యం
98. స్వార్థం
99. స్త్రీ
100, స్నేహం
101. హక్కులు
102. హేతువాదం
103. క్షమ

# భావన

## 1. అందం

హృదయ సౌందర్యము లేని శరీర సౌందర్యం వ్యర్థం. —వివేకానంద.

సౌందర్యము, ఆనందము విడదీయరాని రెండు శక్తులు. —అరవిందయోగి.

చూడఁదగినదై నఁజూడఁగ వలయురా. —వేమన.

'అందమే ఆనందం
ఆనందమె జీవితమకరందం'.

సౌందర్యం గొప్పదే - కాని ఆ సౌందర్యాన్ని ఆరాధించగల
సహృదయత ఇంకా గొప్పది. —కాల్టన్.

## 2. అజ్ఞానం

తెలియని మనుజుని సుఖముగ
దెలుపందగు సుఖతరముగ దెలుపగ వచ్చున్
దెలిసిన వానిం దెలిసియుఁ
దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే. —భర్తృహరి.

కుక్కనందలమునఁగూర్చుండఁబెట్టిన
నొక్క మనసుతోడ నుండఁబోదు.
ఆత్మ నిలుపలేని యజ్ఞానియును నట్టె. —వేమన.

అజ్ఞుల నోరు మూయవచ్చునే. —పాపరాజు.

గంగానది నరుని అంత
రంగమ్మున ప్రవహించగ
అందు పునీతుండుగాక
అజ్ఞుండై తిరుగు నతడు. —గాంధీజీ.

అజ్ఞానమనేది మనస్సుకు రాత్రివంటిది. ఈ రాత్రిలో తారాచంద్రులు
కూడా వుండరు. —కన్ఫ్యూషియస్.

## 3. అధికారం

అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టు. —వేమన.

అధికారం చేతిలో వున్న వాడల్లా దొంగే అవుతాడు.
—ఉన్నవ లక్ష్మీనారాయణ.

అధికారానికి కూడా హద్దులున్నాయి. ఇది గుర్తించకపోవటంవల్లనే గొప్ప గొప్ప సామ్రాజ్యాలు నాశనమైనాయి. —బెర్ట్రండ్ రసెల్.

అవనిలోపల నధికార మబ్బెనేని
క్రిందివారలనెప్పుడుఁ గినియఁదగదు. —కందుకూరి వీరేశలింగంపంతులు.

## 4. అదృష్టం

అవసరానికి ఆదుకునే మిత్రులున్న వ్యక్తి అదృష్టవంతుడు. కాని మిత్రుల సహాయం స్వీకరించాల్సిన అవసరమే రాని వ్యక్తి అంతకంటే అదృష్టవంతుడు. —వార్విక్.

అదృష్టం నిరంతర కృషి అడుగుజాడలలో నడిచి వస్తుంది. —గోల్డ్‌స్మిత్.

ఆకాశంలోంచి వస్తున్న వెలుగు ఏ నక్షత్రానిదని చెప్పగలం.
అదృష్టాలవల్లలభించే సుఖం కూడా అంతే. —బేకన్.

అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పిపోదు —ఒక తెలుగు సామెత.

## 5. అనుభవం

అనుభవం లేని శబ్దజ్ఞానం గ్రుడ్డిది. —వివేకానంద.

అనుభవమే ఒక పాఠశాల. —ఫ్రాంక్లిన్.

అనుభవమే శాస్త్రం, మాటలే మంత్రాలు. —తెలుగు సామెత.

## 6. అప్పు

అప్పుదీయ రోత హరిహరాదులకైన
మొప్పెతోడ మైత్రి మొదలె రోత
తప్పు బలుక రోత తాకట్టు కడు రోత —వేమన.

అప్పు లేనివాడె అధిక సంపన్నుడు —వేమన.

ఒకనికి చెయి సాచుట తనకున్న స్వేచ్ఛ అమ్ముకొనుట. —గాంధీజీ.

ఋణశేషం, అగ్నిశేషం, శత్రుశేషం ఉండకూడదు. —ఒక సూక్తి.

## 7. అలంకారం

తామర సాడికెందు
తలిదండ్రులు పెట్టని సొమ్ము పెన్నెరుల్. —చేమకూర వేంకటకవి.

నగలు లేవటంచు వగ జెందుటేగాని
నగలవల్ల లేని సొగసురాదు;
మగువకేల నగలు మనసిచ్చు మగడున్న? —నార్ల వెంకటేశ్వరరావు.

పుస్తకాలు అలంకరణకోసం వ్రాయబడలేదు. కాని పుస్తకాలంత అందంగా ఇంటిని అలంకరించే సామాగ్రి మరొకటిలేదు. —హెన్నీ బీచర్.

భూషలు గావు మర్త్యులకు భూరి మయాంగద తార హారముల్
భూషిత కేశ పాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభాషణము భూషముల్ నశియించు నన్నియున్. —భర్తృహరి.

## 8. అసూయ

కుళ్ళుఁబోతు నొద్దఁగూడి మాట్లాడిన
గొప్ప మర్మములను జెప్పరాదు. —వేమన.

అన్యుల కల్మిఁగన్గొని యసూయామగ్నుఁడౌ
వానికాపద సేకూరు నవశ్యము. —పాపరాజు.

సరివారి పరువు సైఁపని
నరుడే ధర తెవులు లేక నవయుచుఁగుందున్ —కోలాచలం.

## 9. అహింస

కలుగు నవశ్యమున్ సకల కర్మములందును హింస
హింస సేయనివాడు లేడిజ్జగమున. —ఎఱ్ఱన.

అహింసా పరమో ధర్మః —ఆర్యోక్తి.

దానమును తపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచ మంత్ర తంత్ర సత్యములును
బుధులహింస రూపములు గాగఁ జెప్పుట
నెల్లకల్మి సుమ్మహింస కలిమి. —తిక్కన.

పిరికితనం, హింస—ఈ 'రెండింటిలో ఏది మంచిది'
అని నన్నడిగితే నేను హింసే మంచిదంటాను. —గాంధీజీ.

కుళ్ళిపోతున్న కురుపుమీద వైద్యుడు జరిపే శస్త్రప్రయోగాన్ని
హింస అని ఎవ్వడూ అనలేడు. —శ్రీశ్రీ.

## 10. ఆకలి

మానవుడు ఆకలి అయినప్పుడు అభిమానం, కులం, విద్య, జ్ఞానం, తపస్సు, హోదా, అనురాగం, అన్నిటినీ మర్చిపోతాడు. —అవ్వైయ్యార్.

ఆఁకటికిఁదొలంగు నాచారవిధులెల్లఁ
జీఁకటికిఁదొలంగుఁ జిత్తశుద్ధి వేఁకటికిఁ దొలంగు వెనుకటి బిగువెల్ల. —వేమన.

జాతి నీతి లేక జన్మమ్ము లొక్కటి
అరయ తిళ్లు వేరె ఆకలొకటే. — వేమన.

ఆకలి రుచి యెఱుఁగదు
నిద్ర సుఖ మెరుగదు. —తెలుగు సామెత.

కడుపు కాల్తున్న నిరుద్యోగికి 'వ్యక్తి స్వాతంత్ర్యం' గురించి చెప్పటం వ్యర్థమూ అర్థరహితమూనూ. —జోసెఫ్ స్టాలిన్.

## 11. ఆచారం

సత్పురుషులు ఏ ఏ పనుల నాచరిస్తారో ఇతరులు ఆ పనుల అనుసరిస్తారు.
—ఆర్యోక్తి.

గురుద్విజ రాజ మంత్రి పతివ్రతా తపస్వుల
యందుఁ బరివాద పరిహాసంబులు
పరిహరించుట యాచారము. —మారన.

శిష్టాచారమైనను నీతికి బాహ్యమైనచో నది మాన్యము కానేరదు.
—తిరుపతి వేంకటకవులు.

## 12. ఆత్మ

పువ్వుల్లో సువాసనా, నువ్వుల్లో నూనె, కర్రల్లో నిప్పూ, పాలల్లో నెయ్యీ, చెరుకుల్లో బెల్లమూ వున్నట్లే జ్ఞానుల దేహాల్లో ఆత్మ వుంటుంది.
—చాణక్యుడు.

చార్వాకమత సిద్ధాంతాన్ననుసరించి ఆత్మ, పరమాత్మ, ఉత్తర జన్మ, పూర్వ జన్మ ఏమీ వుండవు. ఇహ జన్మ, ఇహ జీవితం ఈ లోకపు అనుభవాలే ముఖ్యమైనవి. —రాహుల్ సాంకృత్యాయన్.

చూచే చూపొకటి సూటిగుఱి యొకటి
తాచి రెండు నొకవైతే దైవమే సుండి
భావమే జీవాత్మ. ప్రత్యక్షమే పరమాత్మ. —అన్నమయ్య.

తనదు నాత్మఁబరీక్షించుకొనిన యోగి
యెల్లవారల నాత్మల నెఱిగియుండు. —పానుగంటి లక్ష్మీనరసింహారావు.

నిష్కలంకమైన అంతరాత్మ కోటిమంది సాక్ష్యమిస్తామన్నా బెదరదు. అదే కళంకితమైనప్పుడు ఏకాంతంలో కూడా తన నీడకు తానే భయపడుతుంది.
—సెనేకా.

## 13. ఆయుధాలు, సైన్యం

ఈనాడు వివిధ దేశాల సరిహద్దులు నిర్ణయించేవి ఆయా దేశాల ఆర్థిక, సైనిక బలాలుగాని, నదులు, పర్వతాలు కావు. —జీన్‌పాల్‌సార్త్రే.

ప్రజావిముక్తి సైన్యం ఎల్లప్పుడూ పోరాటశక్తిగానే వుంటుంది.
—మావో సేటుంగ్.

కత్తిని ఝళిపించి కూడ గట్టుకొన్న శక్తి వృథా.
నిక్కమైన శక్తి సత్య నిహితమైనదే కదా! —గాంధీజీ.

పట్టుకొన్న శత్రు సైనికులను విడిచిపెట్టడం, దెబ్బలు తగిలిన శత్రు సైనికులకు వైద్యసహాయం చేయటం శత్రు సైనికుల్లో ఫలప్రదమైన రాజకీయ పద్ధతి. —మావో సేటుంగ్.

## 14. ఆరోగ్యం

యథాకాల భోజనము ఆరోగ్యపదము —చరకుడు.

దృఢమైన, ఆరోగ్యవంతమైన శరీరం ఒక మహాసామ్రాజ్యం. —గోల్డ్‌స్మిత్.

శారీరక మౌఢ్యమే సోమరితనం; మానసికమైన సోమరితనమే మౌఢ్యం. —న్యూమె.

## 15. ఆలోచన

అన్ని వైపుల నుండి అత్యుదాత్త భావాల రానివ్వు. —ఋగ్వేదం.

ఈ కాలం యెలాంటిది? నా మిత్రులెలాంటివాళ్ళు? నా దేశం యెలాంటిది? నా రాబడి యెంత. ఖర్చెంత? అసలు నేనెవణ్ణి. నా శక్తి ఏపాటిది? మనిషయినవాడు ఈ సంగతులెప్పుడూ చర్చించుకుంటూనే వుండాలి. —చాణక్యుడు.

ఆలోచనలు న్యాయమార్గం తప్పిన చిహ్నాలు కనబడితే దుఃఖం నీకోసం పొంచి వుందని తెలుసుకో. —తిరుక్కురల్.

మానవునికి ఆలోచించుకునే శక్తి, ముందు చూచే శక్తి వుంది. కనుక జీవితానికొక ఆదర్శాన్నుంచుకొని ప్రయోజనయుక్తంగా చేసుకోవచ్చు. —గోపీచంద్.

ఫిరంగుల మ్రోతకంటె బిగ్గరగా భావాలు ప్రపంచం అంతట ప్రసరిస్తాయి. సైనిక దళాలకంటె శక్తివంతమైనవి ఆలోచనలు. అశ్వారూఢులు. రథాలు సాధించిన విజయాలకంటే అధికంగా భావ సూత్రాలు సాధిస్తాయి. —డబ్లుయు. ఎమ్. పావ్సన్.

## 16. ఆశ

ఆశ అనునది మనుష్యులకుగల బంధనములలో అత్యాశ్చర్యకరమైనది. దీని వలన బంధితులైనవారు పరుగులు పెట్టుచుండగా, ఈ సంకెల నుంచి విముక్తులైనవారు కుంటివారివలె చతికిలపడిపోతుంటారు. —హితోపదేశం.

ఆశ అనేది మోహపాశం అవుతే అవుగాక, జీవితం ఆవలితీరం వరకూ మనని తన వెంట తీసుకువెడుతుంది. —ఫ్రాంకాయిస్ డెలారోష్.

ఆశలేని ప్రాణి అణగారిపోవును;
ఆశ జంపుకొనుట ఆత్మహత్య;
ఆశవలయు; కూడదత్యాశ మాత్రమే. —నార్ల వెంకటేశ్వరరావు.

ఉదయం కానే కాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లానే వుండాలనుకోవడం దురాశ. —కాళోజీ.

## 17, ఆశయం - ఆచరణ

ఆచరణలేని జ్ఞానమున్ను, జ్ఞానములేని క్రియలున్నూ కూడ నిరుపయోగ ములై నశించును. నడువలేని కుంటివాడు, చూడలేని గ్రుడ్డివాడున్ను ఉన్న యిల్లు తగులబడినచో చూచుచునే కుంటివాడు, నడవగలిగియు గ్రుడ్డి వాడును నశింతురుగదా. —కఠోపనిషత్తు

ఉపదేశించుటకును, చెప్పుటకును అందరూ పండితులే కాని చెప్పినవాటిని ఆచరించు సమయమున మాత్రము మునులు కూడా పండితులవలె కాక పామరులవలె ప్రవర్తిస్తారు గదా. —పంచతంత్రం.

లోకంలో హితబోధ చేసేవారు లేక లోకం పతనం కావడంలేదు. వినేవారు, ఆచరించేవారులేక. మంచి చేసేవారికన్న చెప్పేవారు ఎక్కువ.
—బోర్ట్ మెన్.

అజ్ఞానంలో అమాయకత్వంలో జీవిత సంస్కారంలేని ప్రజాసామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారం కలిగించడానికి నిరంతరం కృషి చేయాలి. —కందుకూరి వీరేశలింగం పంతులు.

## 18, కర్మ

నా దక్షిణ హస్తంలో కర్మవుంది, నా వామ హస్తంలో విజయంవుంది.
—అథర్వణ వేదం.

కర్మ చేయుటయందు నీ కధికారము, ఫలముకోరుట యందధికారము లేదు. కర్మఫలము నీకోరికకై రాకూడదు. కర్మ చేయకయు నీ వుండరాదు.
—భగవద్గీత.

ఓ విశ్వాసులారా ! భగవంతుని ఆజ్ఞలను శిరసావహింపుడు. ప్రవక్తల వాక్యములకు తలలొగ్గుడు. మీరొనరించు కర్మలు నిష్ఫలములుగా చేసికొనకుడు. ఫలాపేక్షలతో జేసినచో నిస్సారములే యగును. —కొరాన్.

కర్మసిద్ధాంతం మనిషిని ఆజన్మాంతం బానిసత్వంలో వుంచుతుంది. కర్మసిద్ధాంతం ప్రకారం మానవుడు తానేమీ చేయలేని స్థితిలో పడిపోతాడు. "అంతా దైవమే నిర్ణయిస్తాడు" అని తృప్తి పడతాడు.

—యం. యన్. రాయ్.

సమస్త కర్మలకు లక్ష్యం ఆనందం. —రవీంద్రనాథ్ టాగోర్.

## 19. కర్షకుడు, కార్మికుడు

పాటపాడుతూ కులాసాగా పనిచేసే తేనెటీగవలె బ్రతకటం నేర్చుకో.

—గోల్డ్‌స్మిత్.

నీకు ఇష్టంవచ్చినది చేయడం లాభకరం కాదు. నీవుచేసే ప్రతిపనీ నీకు యిష్టాన్ని కలిగించగలగాలి. —విన్‌స్టన్ చర్చిల్.

పరిశ్రమవల్ల శరీరం గట్టిపడితే, కష్టాలవల్ల మనసు దృఢపడుతుంది.

—సెనేకా.

కర్షకుడు తనజీవితాన్ని ప్రకృతితో సమన్వయపరచు కుంటాడు. అందుకే అతనికి ఓర్పు జీవితాంతం ప్రకృతి సిద్ధంగా వుంటుంది. —ఎమర్సన్.

కోరినలక్ష్యం దురదృష్టవశాత్తూ సాధించలేకపోయినా చేసినకృషి మాత్రం సత్ఫలితాన్ని యిచ్చి తీరుతుంది. —తిరుక్కురల్.

కృషి వుంటే దుర్భిక్షం ఉండదు. —ఆర్యోక్తి.

## 20. కవి, కవిత్వం

ఇంకోకవి-ఎంతగొప్పవాడైనా-
నువ్వు వాడివి కావాలని ప్రయత్నించకు. —శ్రీశ్రీ.

కవీ నీకాలాన్ని వృధాచేస్తున్నావు. సంఘటనల్ని లిఖించడమే నీ పని. చివరకి పక్వానికి తేవల్సింది నువ్వుకానేకాదు...విప్లవమే ఆ కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది. —మాగ్జిమ్ గోర్కీ.

కవితాకన్యకు నలుగురు
కవిజనకుడు భట్టుదాది గణుతింపంగా
నవరస రసికుఁడు పెనిమిటి
యవివేకయె తోడఁబుట్టువన వేమనృపా ! —చాటువు.

కప్పిచెప్పేది కవిత్వం
విప్పిచెప్పేది విమర్శనం. —డా. సి. నారాయణరెడ్డి.

రసాత్మకమైన వాక్యమే కావ్యం. —విశ్వనాథుడు.

చరిత్రకంటే కవిత్వం సత్యానికి దగ్గరగా వుంటుంది. —ప్లేటో.

## 21. కష్టం, సుఖం

కాలినలోహం కలిసిపోయినట్లు కష్టాల్లో మనుష్యుల మనస్సులు తొందరగా ఒకటై పోతాయి. —కాల్టన్.

చాలాసుఖాలు దొంగనోట్లు, వాటివిలువ తెలుసుకునేవరకు మాత్రమే చలామణిలో వుంటాయి. —జాన్‌సన్.

కష్టాలూ, సాధకబాధకాలూ శిల్పి చేతుల్లో సుత్తి, ఉలి వంటివి. ఎంత రాయివంటి జీవితాన్నయినా అవి మలిచి, అందంగా తీర్చి దిద్దుతాయి. —గొథే.

ఉక్కుమనిషి యెవడో, ఊకమూట యెవడో
కష్టకాలమందె స్పష్టపడును;
ఉత్తవేళలందు ఉత్తము లందఱు. —నార్ల వెంకటేశ్వరరావు.

రాపిడిలేనిదే రత్నం ప్రకాశించదు. అలాగే కష్టాలను తట్టుకోలేని మానవుడు ఏనాటికీ పరిపూర్ణత పొందలేడు. —చైనా సామెత.

గడిచిపోయిన కష్టాలను స్మరించుకో. అనుభవిస్తున్న సుఖాల తీయదనం పెరుగుతుంది. —కాల్టన్.

## 22. కళలు, కళాకారుడు

కళలో ప్రధానాంశం సౌందర్యం. వికారాన్ని చిత్రించేటప్పుడు కూడా ఇది అవసరమే. —నోరా రిచర్డ్స్.

మాట మనిషివంటిది. పాట పక్షివంటిది. మాట నడుస్తుంది. పిలుస్తుంది, పలుకుతుంది. గానం అంతరిక్షాల్లోకి వెళ్ళిపోతుంది. గానం అందుకోలేని ఎత్తులు లేవు. —దేవులపల్లి కృష్ణశాస్త్రి.

శక్తిమంతమైన ఒక కళా సాధనం ఉపయోగించుకోవడం తెలియకపోతే అది ఎంత వికృతంగా తయారవగలదో సినిమా కళ రుజువు చేస్తుంది.
—విలియం సారోయన్.

సైన్సు చెప్పలేనిది, మతం చెప్పగలనని భ్రమపెట్టినది చెప్పగలుగుతుంది కళ. —క్రిస్టోఫర్ కాడ్వెల్.

'సామాన్య ప్రజలకు అందుబాటులో వుండేదే కళ' అనడం చాలా సంకుచితం. అందరి అందుబాటులో వున్న ఆకాశం ఎంతమందికి ఉపకరిస్తోంది? కాని ఎవరికీ స్పష్టంగా తెలీకుండానే ప్రతివారికీ వుపకరిస్తూనే వుంది. ఈ నీలమైన ఆకాశం ప్రతిచోటా, ప్రతినిమిషం కనిపించని రోజువస్తే, తెలుస్తుంది. ఆ సౌందర్యాన్ని మించిన సౌందర్యం మన జీవితాన్ని తనకి తెలీకుండానే ఎంత అందంతో నింపిందో! అట్లాగే గొప్ప కళ ఓ ఉద్దేశ్యానికి, ఓ పనికి తోడ్పడకపోయినా అంతకుమించి ఉపకరిస్తూనే వుంటుంది. కాని ఏ ఉపకారమో గుర్తించలేరు. అసలు ఆ కళలోని ఆధిక్యత ఎక్కడ వుందో చెప్పుకోలేరు. కాని వొదలలేరు. అదీ గొప్ప కళ లక్షణం. —చలం.

ప్రకృతిలో భగవంతుడు భాసిస్తాడు, కళలో మనుష్యుడు. —లాంగ్ ఫెలో.

## 23. కార్యసాధన

ఫలార్థియైనవాడు తత్ఫలానుబంధంబున రోషంబులు పరికింపడు.—నన్నయ.

సాధనమున పనులు సమకూరు ధరలోన —వేమన.

ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకములారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొక తఱిన్ యోగ్యాంబరశ్రేణి; లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్
—ఏనుగు లక్ష్మణకవి.

"అత్యల్పమనుకునే విషయాలు కూడా పట్టించుకున్నప్పుడే
అత్యద్భుతమైన విషయాలు సాధించగలం".

## 24. కాలం

ధన జన యౌవన గర్వాన్ని పొందకు. మనం స్థిరమని భావించే ప్రతి వస్తువునూ కాలం అనేది హరిస్తూ వుంటుంది. —శంకారాచార్య.

కాలాన్ని మించిన నియంత లేడు —గోల్డ్‌స్మిత్.

కాలాని కొక్కటే పని. అది రావడం, వచ్చి వెళ్లిపోవడం. నిజానికి రెండూ వొకటే. కాని సావధికమైన మనుష్యుని దృష్టిలో వుందీ విభాగం.
—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

కాలాన్ని అర్థం చేసుకున్న మనిషి జీవితాన్ని అపార్థం చేసుకోలేడు.
—జాన్‌సన్.

అరిగిన ప్రతి క్షణం తిరిగి రాదని తెలిసి
ఎంత సమయమ్ము వెచ్చించు చుందుము మనము. —గాంధీజీ.

## 25. కుటుంబం

కుటుంబంలో సంతోషానికి మూలం భార్యా భర్తలు. ఆర్థిక స్తోమతను కుటుంబ సంస్కృతిని తెలుసుకొని జీవించడం, స్తోమత తెలుసుకోలేనివారి దాంపత్యం ఫలించదు. —తిరుక్కురల్.

తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖులు
నెలమి బంధు భృత్యులెల్ల జనులు
గలిగి వర్ధిల్లంగ ఘనతతో నుండరా. —వేమన.

కుటుంబం అనేది నిత్యం మారుతూ వుంటుంది. అదెప్పుడూ స్థిరంగా వుండదు. సమాజం దిగువ దశనుండి పై దశకు మారుతున్న కొద్దీ అదికూడా పైపైకి పాకుతూ వుంటుంది...కాని రక్తసంబంధాల వ్యవస్థ అలాకాదు. అది కదలదు. చాలాకాలానికోమారు, కుటుంబంలో వచ్చిన ప్రధానమైన మార్పుల్ని అది నమోదు చేస్తూంటుంది. కుటుంబవ్యవస్థ పెద్దగా మారినప్పుడు అది మారుతుంది. అంతవరకది కదలదు. — మోర్గన్.

ఆధునిక కుటుంబంలో జానిసత్వమేకాదు దాంపత్యంకూడా బీజరూ
మనకు కనిపిస్తూంది. ప్రారంభంనుంచీ వ్యవసాయపు పనులకోసమే
వచ్చింది. తర్వాత తర్వాత సమాజంలోనూ, రాజ్యాంగంలోనూ, ప
రూపంలో బయటపడిన వైరుధ్యాలన్నీ దీనిలో సూక్ష్మరూపంలో
స్తున్నాయి. —కారల్ మా

'చిన్న కుటుంబమే చింతలులేని కుటుంబం.'

## 26. కోపం

కోపం ఒక ఘనత అనుకొని, లాభం అనుకొని లొంగిపోయినవారు
వలన కలిగే కీడును అనుభవించక తప్పదు. —తిరుక్కు

కోపమునను ఘనత కొంచెమైపోవును
గోపమునను మిగుల గోడుచెందు
కోప మడచెనేని కోరిక లీడేరు. —

క్రోధము నణచుటయే మానవత్వము —గా

తనవారిపైవచ్చు కోపము నాపుకొనుటలోనే జయమున్నది. పరాయివా
వచ్చు కోపము నెవరైనను విధిలేక ఆపుకొనవలసి యుండును. కనుక
జయమేమున్నది ? —గాం

తనకోపమె తన శత్రువు —సుమతీ శ

## 27. గర్వం

గర్వం అనేది అందరిలోనూ సమానంగానే ఉంటుంది. ఉన్న తేడా
పైకి కనపరచే పద్ధతి, విధానాలలో మాత్రమే.—ఫ్రాంకాయిస్ డెలా

చేయకుండఁ జేసితినని చెప్పునాతఁ
డధముడు, రవంత జేసి కొండంతచేసి-
నాఁడననువాఁడు గర్వి; యెంతయో యొనర్చి
సుంతఁ జేసితిననువాడు సుజను డిలను. —పానుగంటి లక్ష్మీ నరసింహా

మేము సత్యవంతులం, ఆధ్యాత్మిక పరులం, మేము నమ్రత కలవాళ్ళం అన్ని సద్గుణాలూ మాకేనన్న గర్వంకూడా తప్పుతాగించినంతపనీ చేస్తుంది. అన్ని గర్వాలలోకీ గొప్ప హానికరమైన గర్వం నేను ధర్మపరుణ్ణి అనే గర్వం.
—చలం.

ముసలితనం రూపాన్ని, ఆశ ధైర్యాన్ని, మృత్యువు ప్రాణాన్ని, అసూయ ధర్మాచరణాన్ని, క్రోధం సంపదను, కామం సిగ్గును, గర్వం సమస్తాన్ని హరిస్తుంది.
—విదురనీతి.

మధువన్నది క్షణకాలము మనిషికి మరులెత్తించును
మదమన్నది మనిషినే అమాంతముగ కబళించును. —గాంధీజీ.

వివేకవంతుడెప్పుడూ గర్వాన్ని దరికి రానీయడు. —షేక్‌సాదీ.

## 28. చట్టం

చట్టం లేకుండా ప్రభుత్వం వుండగలదు. కాని ప్రభుత్వం లేకుండా చట్టం ఉండలేదు.
—బెర్ట్రండ్ రసెల్.

డబ్బులేనివారిని చట్టం శాసిస్తోంది. ధనవంతులు చట్టాన్ని శాసిస్తున్నారు.
—గోల్డ్‌స్మిత్.

చట్టాల వలలు పన్నేదెందుకు ?
చిట్టిచేపల పట్టేటందుకు. —ఖలీల్ జీబ్రాన్.

## 29. చరిత్ర, చరిత్ర కారుడు

చరిత్రలోని అతి మహత్తరమైన వ్యక్తి బీదవాడు —ఎమర్సన్.

అందరూ అంగీకరించిన కట్టుకథ కాక మరేమిటీ చరిత్ర ? —నెపోలియన్.

ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం. —శ్రీశ్రీ.

చరిత యనగ కాదు సామ్రాజ్య కీర్తన;
చరిత యనగ కాదు సమరగాథ;
చరిత యనగ సకల నరజాతి ప్రగతిరా! —నార్ల వెంకటేశ్వరరావు.

భౌతికవాద దృక్పథం ప్రకారం చెప్పాలంటే మిగిలినదాని మాట ఎలా వున్నా తక్షణం జీవితం యొక్క ఉత్పత్తిక్రమమే చరిత్రను నడిపిస్తుంది ఈ ఉత్పత్తిక్రమం ద్వివిధం. ఒకటి : జీవితావసరములయిన ఆహారం, బట్టల ఇల్లు అవసరములైన పనిముట్లు మొ॥ వస్తువుల ఉత్పత్తి. రెండోది : ప్రజో త్పత్తి, జాతియొక్క విస్తృతి. —ఫ్రెడరిక్ ఏంగెల్సు

సజీవమైనజాతి చరిత్రను పునరావృతం కానీయదు.—జవహర్ లాల్ నెహ్రూ

## 30. జ్ఞానం

జ్ఞానాన్ని పోలింది మరొకటిలేదు —భగవద్గీత

జ్ఞానమెన్న గురువు, జ్ఞాన హైన్యము బుద్ధి
రెంటి సందు రిమ్మ జేచునపుడు
రిమ్మఁదెలిసెనేని రొండొక్క రూపెరా —వేమన

విజ్ఞానం లక్ష్యం సత్ప్రవర్తనమే. —సర్ పి. సిడ్నీ

విజ్ఞానమనేది ఒకరి సొత్తుకాదు. అదలా వృద్ధిపొందుతూనే ఉంటుంది మనం మన తల్లిదండ్రుల్ని తెలివితక్కువ వారని తలుస్తే మన తరువాత వారు మనల్ని అలాగే అనుకుంటారు. —అలెగ్జాండర్ పోప్

నెలరోజులు గ్రంథ పఠనంతో సంపాదించే జ్ఞానాన్ని, పండితుడితో గంట కాలం సంభాషించడంతోనే పొందవచ్చు. —చైనా సామెత

## 31. జ్ఞాపకాలు

అయిదు పదాలను జ్ఞప్తిలో వుంచుకోవాలి. గాంభీర్యము, ఆత్మ ఔదార్యము, లక్ష్యము, దయ, తృప్తి. —కన్ఫ్యూషియస్

జీవితగ్రంథం మొదటి పుటలో కనిపించేది ఒకతోట, యువతి, యువకుడు చివరిపేజీల్లో వారి జ్ఞాపకాలు. —ఆస్కార్ వైల్డ్

ఎగురగలిగే సామర్థ్యాన్ని కలుగజేసే రెక్కలు జ్ఞాపకాలు.
—మాకన్ లాల్ చతుర్వేది

నిన్నటి దుఃఖం జ్ఞాపకం వుంటే
నేటి ఆనందంలో మాధుర్యం గుబాళిస్తుంది. —పోలక్

## 32. జీవితం

బాల్యంలో క్రీడాసక్తితోను; యౌవనంలో వనితాసక్తితోను, వృద్ధాప్యంలో చింతాసక్తితోను వుండు నీవు బ్రహ్మాసక్తితో ఎప్పుడుంటావు ?

—శంకరాచార్య.

బాగుపడదలచిన మానవుడు అతినిద్ర, బద్ధకము, భయము, కోపము, ఆలస్యము, దీర్ఘసూత్రత యను నీ ఆరుదోషములను విడువవలెను.

—హితోపదేశం.

జీవితం విజ్ఞానంచేత నడుపబడాలి. ప్రేమచేత ప్రకోపింపబడాలి. అదే మంచి జీవితం. —బెర్ట్రండ్ రసెల్.

జీవిత ప్రవాహం ప్రచండవేగంతో వెళ్ళిపోతూ వుంటుంది. ఎవరెవరి సంస్కారాన్నిబట్టి వాళ్ళు తమ సుఖంకోసం పోటీపడుతున్నారు. ఇదొక మహా సంగ్రామం. ఇందులో పిరికివాళ్ళకు, అసమర్థులకు చోటులేదు. అంతేకాదు, జ్ఞానమును సంఘజీవితానికి ఉపయోగపరచే మనస్తత్వంకావాలి. అదిలేకుంటే సంఘర్షణ, పతనం తప్పదు. —గోపీచంద్.

జీవితం చాలా చిన్నదే. కానీ దాంట్లో నమ్రతగా వుండటానికి చాలా సమయం వుంది. —ఎమర్సన్.

నా జీవితమే ఒక సందేశం. —గాంధీజీ.

## 33. తప్పు, తొందరపాటు

ఏ పనినీ తొందరపడి చేయకూడదు. తొందరపాటే, అవివేకమే అన్ని ఆపదలకు మూలము. సవిమర్శకముగా పౌగాములాలోచించి పనిచేయువానిని గుణలుబ్ధయై లక్ష్మి స్వయముగనే కోరి వరించును కదా.

—కిరాతార్జునీయమ్.

తప్పులెన్నువారు తండోపతండమ్ము
లుర్వి జనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు. —వేమన.

తొందరపాటు తన మడమలపై తానే గిరికీలు కొడుతూ చివరకు తానే సంకెళ్ళు వేసుకొని ఆగిపోతుంది. —సెనేకా.

ఇతరుల దోషాలను చూసినట్లు తమ దోషాలను చూడగల్గితే ఈ ప్రపంచంలో నుండి దుర్మార్గం తొలగిపోవడం తథ్యం. —తిరుక్కురల్

తప్పుచేయడం మానవుని అలవాటు. క్షమించడం భగవంతుని వంతు.
—అలెగ్జాండర్ పోప్.

## 34. త్యాగం

పెట్టిపోయలేనట్టి నరులు భూమి
బుట్టనేమి ? వారు గిట్టనేమి ?
పుట్టలోనఁజెదలు పుట్టవా గిట్టవా ? —వేమన.

ఈదునపుడు నీటిని వెనుకకుదోసినచో ముందునకు బోవుదుము. సంసార సాగరము నీదునపుడు త్యాగముచే వాసనలను వెనుకకు తొలగించిన ముందుకు పోగలము. —స్వామి రామతీర్థ.

కొలువక యిచ్చుట త్యాగము
కొలిపించుక యిచ్చుటెల్లఁ గూలివనింతే
కొలువునకుఁ బసరమీదా ? —చాటుపద్యం.

త్యాగం చెయ్యండని ప్రజలకు బోధించడం వట్టి దగా. సామాన్య ప్రజ త్యాగం చెయ్యాల్సిందేముంది—ప్రాణాలుదక్క. అందర్నీ త్యాగం చేయమని "నాకాయుష్యం, నాకారోగ్యం" అనుకునే పెద్దల్నేగాక, కిమ్మనకుండా సర్వం త్యాగంచేసే వాళ్ళనుకూడా చూస్తాం. ప్రజలకి తెలుసు ఎవర్ననుసరించాలో. —మాగ్జిం గోర్కీ.

తాము నమ్మిన లక్ష్యంకోసం జీవితాలను ధారవోసినవారే మహాపురుషులయ్యారు. —జాన్‌సన్.

అనాదిగా లోకక్షేమమని, మతమని, దేవుడని, సంసారమని విజ్ఞానమని ఉత్తములు చేసిన త్యాగఫలితం. ఈనాడు ఆ ఉత్తములేవుండి చూడగలిగితే, తమనిచూసి తాము నవ్వుకుంటారో, ఈ ఫలితం కోసమా తమ బ్రతుకుల్ని ఏ సుఖమూ లేకుండా తగలేసుకున్నామని బావురుమని ఏడుస్తారో !

—చలం.

## 35. తిరుగుబాటు

అంజనీ మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం —శ్రీశ్రీ

కలిమిలేనిచోట కళలెట్లు వర్ధిల్లు ?
కలిమి కలిగినపుడె కళలవృద్ధి,
వెలితి నుండిపుట్టు విప్లవమొక్కటే ! —నార్ల వెంకటేశ్వరరావు.

పీడితప్రజలూ, దేశాలు తమ విముక్తికొరకు సామ్రాజ్యవాదుల, వారి తొత్తుల "మంచితనం"పై ఆశలు పెట్టుకోరాదు. తమఐక్యతను దృఢతరం చేసుకోవడం ద్వారానే, పోరాటాన్ని కొనసాగించడం ద్వారానే వారు విజయాన్ని సాధించగలుగుతారు. —మావోసేటుంగ్.

అనాదిగావస్తున్న నమ్మకాలనూ, సెంటిమెంట్లనూ ప్రమాణాలను ప్రశ్నించ గలిగిన తెలివీ, ధైర్యం ప్రపంచంలో ఎక్కువైనకొద్దీ, సంఘ నిర్మాణపు పునాదులే వూగిసలాడటం జరుగుతోంది. —చలం.

ఆకలిమంటకు మలమల మాడే
అనాథులందరు లేవండోయ్ !
హింసారతిని సహించగ లేక
ఈసడించినది ఎల్ల ధర్మమూ.
మంచిదినాలు రానున్నాయీ
మనకందరకును లేవండోయ్ !
..............................
కర్షక కార్మిక సంయోగంబె
కష్టజీవులందరి కలయికయే
పాటుబడే మన అందరి పక్షం
మనదీ దేశము ప్రజలును మనమే
..............................
ప్రధానమగు ఈ పోరాటములో
పాల్గొన నందరు లేవండోయ్ ! —యూజీన్ పాటియర్.

## 36. దాంపత్యం

సకలావస్థలనేది కష్టసుఖముల్ సైరించునో యేకమై
వికలంబైన మనంబు నెందుగనునో విశ్రాంతి, యెందొప్పు వా
ర్థక మందుందమి, పెండ్లియాది మృతి పర్యంతంబుగాఁ బ్రేమ సా
ర్థకమౌనెయ్యది, నిత్య భద్రమయి యాదాంపత్యమే పొరెడున్

—మూలం : భవభూతి.

—తెలుగు అనువాదం : మల్లాది సూర్యనారాయణ శాస్త్రి.

మాటవిననియాలు మగనికి మఱగాలు
దానిజేర ప్రాణ మానహాని
అట్టియాలి విడిచి యడవి నుండుట మేలు. —వేమన.

"భార్యని తప్ప, మరేస్త్రీని వుంచుకోగూడదు" స్పార్టకస్ అన్నాడు. "అలాగని ఏ ఒక్కడికీ ఎంతోమంది భార్యలుండరాదు. ఒక పురుషుని కొక్కర్తె భార్య. భార్యా భర్త లిద్దరూ న్యాయం దృష్టిలో సమానులే. వాళ్లు సౌఖ్యంగా, శాంతియుతంగా జీవితం గడుపలేకపోతే విడిపోవచ్చు."

—హోవర్డ్ ఫాస్ట్.

జీవితం రేడియోసెట్టుకి
భర్త ఏరియల్ భార్య ఎర్తు. —ఆరుద్ర.

ఆలుమగలయందు నన్యోన్యమున్నచో
దప్పులేల గలుగు ధరణియందు. —కొప్పరపు సుబ్బారావు.

భర్తలో లోపాలు చూడలేని స్త్రీ చాలా అంధురాలూ, అల్పురాలూ.

—చలం.

నరుడులేక నారి చరితార్థ కాలేదు
నారిలేక నరుడు క్రూరుడౌను;
నలువకలలపంట నారీనరుల జంట —నార్ల వెంకటేశ్వరరావు.

## 37. దారిద్ర్యం

దుబారా మనిషికి దారిద్ర్యం తప్పదు. ఆ దారిద్ర్యం మనిషి వ్యక్తిత్వాన్ని హరించి నేరస్థుణ్ణిగా తయారు చేస్తుంది. —జాన్సన్.

దారిద్ర్యం అనేక అనర్థాలకు పుట్టినిల్లు. మనస్సుని చిందరవందర చేసి మనిషి లోని నీచత్వాన్ని బయలుపరుస్తుంది. దారిద్ర్య నాశనమే లోక కళ్యాణ హేతువు. —గోపీచంద్.

ఉదార బుద్ధులను క్రుంగదీసేదీ, కృషిని నిర్వీర్యం చేసేది ధృఢనిర్ణయాన్ని నిస్పృహగా మార్చేది పేదరికం. —ఎడిసన్.

పరిశుద్ధమైన ప్రేమ కొంచెమేని లేనివాడే దరిద్రుడు. —గాంధీజీ.

## 38. దాస్యం

దాసుడు సజీవుడైతే మరి మృత్యువాత పడిందెవరు ? —హితోపదేశం.

అధికసంఖ్యాకుల నిర్ణయము లెట్టివైనను కేవలము వానినే అనుసరించిపోవుట దాస్యలక్షణము. —గాంధీజీ.

మన మెవరిని హీనులుగా, నీచులుగా చూస్తామో వాళ్ళే క్రమంగా మనల్ని హేయంగా, దీనంగా చేసేస్తారు. —రవీంద్రనాథటాగోర్.

ప్రాథమిక సూత్రాల కన్నిటికీ దాస్యం విరుద్ధమైనది. —మాంటేగ్.

## 39. దుఃఖం

శోకము సుఖముం జెఱచును
శోకము తేజంబు నడచు శోకము బుద్ధిం
బోకార్చుఁ గానఁ దాలిమిఁ
గైకొని శోకంబు విడవఁగా వలయు నృపా. —మల్లికార్జునుడు.

మానవుడు దుఃఖానుభవాన్ని సుస్పష్టంగా ప్రకటించుకోగల భాష ఏదీ ఇంతవరకు కనిపెట్టబడలేదు. —శరత్.

రాత్రి నక్షత్రాలను వెలువరించినట్టు, దుఃఖం మన కెన్నో సత్యాలను సాక్షాత్కరింపజేస్తుంది. —జి. బెయిలీ.

చిన్న దుఃఖాలెప్పుడూ అల్లరి పెడతాయి. కాని గొప్ప దుఃఖాలు మనిషిని మూగవాణ్ణిగా చేస్తాయి. —సెనేకా.

శోకం పోయింది జీవనశోభే పోయింది
మనస్సు పోయింది ప్రపంచమే పోయింది. —జిగర్.

## 40. దేవుడు

నీ అంత్యకాలము సమీపించు సమయంలో నిన్ను నీ పాండిత్యమెంతమాత్రం కాపాడదు. కాన నిన్నుకాపాడే భగవంతుణ్ణి నమ్మివుండు.—శంకరాచార్య.

భగవంతుడే ప్రపంచమును యుద్ధోన్మత్తుల పదఘట్టనములచే మృత్యువు వికృతారావములచే, ఘర్షణచే నిండిన రణక్షోణిగ సృష్టించెను. ఈ జీవిత సమరమున విధిగ పాల్గొనక దొంగవలె నీ వెట్లు ఆత్మశాంతిని పొందగలవు.
—అరవిందయోగి.

మన దేశంలో దేవుడు, కర్మ చలామణి అవుతున్నట్లు మరేవీ చలామణి కావటంలేదు. వీటిని రుజువు చేయటానికి వేదాలు, ధర్మశాస్త్రాలు సృష్టించ బడ్డాయి. వాటి కనుగుణంగా మానవసంఘం నిర్మించబడ్డది.
—యం. యన్. రాయ్.

దేవుడు తప్ప అన్నీ వున్నవారు దేవుడు తప్ప ఏమీ లేనివారిని చూచి నవ్వుతారు. —రవీంద్రథటాగోర్.

దేవుడనే వాడొకడుంటే జనమంతా ఆయనమీద తిరగబడి సన్మార్గవర్తిని చేయడ మవసరం. —ఉన్నవ లక్ష్మీనారాయణ.

దేవుండు దేవుండనగా
దేవుండా దివియునుండి దిగివచ్చేనా
ఈవి గలవాడే దేవుడు
గావుద భువి కుందవరపు కవిచౌడప్పా. —కవి చౌడప్ప.

## 41. దేశం, దేశభక్తి

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్
దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్. —గురజాడ అప్పారావు.

దేశాలు సుసంపన్నం కావాలంటే అది సారవంతం అయివుండనవసరంలేదు, అవి స్వతంత్రం అయితేచాలు. —మాంటిస్క్యూ.

నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని జాతీయమై యుండవలయును. విజాతీయమై యుండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవానికి రక్తి. ఎంత సముద్రముమీద ఎగిరినను పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత. —విశ్వనాథ సత్యనారాయణ.

ఏ దేశమేగినా ఎందు కాలిడినా
ఏ పీఠ మెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవమును. —రాయప్రోలు సుబ్బారావు.

## 42. ద్వేషం, దుర్మార్గం

ద్వేషము ద్వేషమువలన నెన్నటికిని నశింపదు. ప్రేమవలననే అది శాంతించును. —బుద్ధుడు.

శత్రువులబారినుండి తప్పించుకొనవచ్చును, చేసిన దుర్మార్గం నిన్ను నిరంతరం వెంటాడుతూనే వుంటుంది. దానినుండి తప్పించుకోలేవు. —తిరుక్కురల్.

దుష్టులలో తారతమ్యా లుండవు. వారిలో ప్రతివొక్కడూ అవిధేయుడైన కొడుకుగానే జీవితాన్ని ప్రారంభించివుంటాడు. —చైనా సామెత.

ఎంత గొప్ప కారణమున్నా మానవులు ఒండొరులను ద్వేషించుకోవడం మహాపాపం. నేను పాపులయెడ పక్షపాతినన్నమాట సత్యం. —శరత్.

ఇనుమునందె పుట్టి, ఇనుమునే తినివేయు
తుప్పువంటిదోయి తులువతనము
తాను చెడును తులువ, తనవారి జెడగొట్టు. —నార్ల వెంకటేశ్వరరావు.

## 43. దోపిడి

మానవ సహజమైన భోగము సదా గ్రాహ్యామే. కాని దొంగలా పదిమందిని దోచుకొని ఒంటరిగా అనుభవించడ మన్నదే అది పశుభోగం, పశుకామం. —రాహుల్ సాంకృత్యాయన్.

ఒక ప్రజమీద ఒకరు అధికారం చలాయించి దోచుకోడానికి యిదివరకు ఏవో కొన్ని గొప్పకారణాలు చెప్పుకొనేవారు. ఇప్పుడు ఆ మోసం అనవసరం. నాకు చిక్కింది కనుక నేను తీసుకొంటున్నాను. అంతేకాదు. ఏ దేశం ప్రభుత్వంలోని సభ్యులు తమ దేశాన్నే మోసగించి దోచుకు దాచుకుంటున్నారు. —చలం.

నాకు అందినది నాది
నాకు అందనిది మనది. —కాళోజీ.

దేవతలు దేవుళ్ళు అంతా కల్పితం. దేవుళ్ళపేరుచెప్పి. భయాన్ని చూపి, ప్రజల శ్రమఫలితాన్ని దోచుకోవడం ఘోరమైన అన్యాయం.
—రాహుల్ సాంకృత్యాయన్.

## 44. ధనం

ఓ మూఢ మానవుల్లారా ! అష్టకష్టాలుపడి సంపాదించిన డబ్బును దాచి పెడతారెందుకు ? ఊపిరిపోయిన తరువాత ఆ ధనాన్ని ఎవరనుభవిస్తారు ?
—అవ్వైయార్.

కులము గల్గువారు గోత్రంబు కలవారు
విద్యచేత విర్రవీగు వారు
పసిడి గల్గువాని బానిస కొడుకులు. —వేమన.

డబ్బులేని బ్రతుకు మబ్బుపట్టిన రాత్రి;
డబ్బుతోడ వచ్చు నిబ్బరమ్ము;
డబ్బులేనివాడు డుబ్బుకు కొఱగాడు. —నార్ల వెంకటేశ్వరరావు.
ఈ జగత్తుకు ధనమే మూలం. —భర్తృహరి.

ప్రపంచంలో డబ్బే ప్రధానమని అనుకునేవాడు డబ్బుకోసం ఏపనైనా చేస్తాడు. —సోమర్ సెట్ మాం.

## 45. ధర్మం

ధైర్యము, ఓర్పు, మనోనిగ్రహము, తనదికాని వస్తువునందు ఆశలేకుండుట, శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము, బుద్ధిమత్వము, విద్య, సత్యభాషణము, కోపరాహిత్యము—ఈ పదిన్నీ ధర్మమునకు లక్షణములు. —మనుస్మృతి.

ధరించినది గావున ధర్మమనబడినది. ధర్మమే ప్రజలను ధరిస్తూవుంది. ఏది సంఘాన్ని కట్టుబాటులో నిలుపుతూందో అదేధర్మమని పెద్దలు నిశ్చయించి నారు. —మహాభారతం.

ఆయువు, సంపద, గృహచ్ఛిద్రము, మంత్రము, ఔషధము, సంగమము, దానము, మానము, అవమానము—ఈ తొమ్మిదింటినీ బుద్ధిమంతులు రహస్యముగ నుంచవలెను. —హితోపదేశం.

పరుల ధర్మము లెంతమంచివైనను, వానినిబట్టి ప్రాకులాడకుము. వాని వలననీకు ప్రయోజనము లేదు. స్వీయధర్మములను విడువకుము. అవి అనంత శ్రేయోదాయకములు. వానిని నీవు నిర్వహింపుము! మేలును గాంచెదవు. —బుద్ధుడు.

పుత్రుని అయిదేళ్ళ వరకూ ప్రేమగా పెంచాలి. పదిహేనేళ్లు వచ్చువరకు కొట్టియైనను శిక్షణలో వుంచాలి. పదహారేళ్లు వచ్చాక స్నేహితునివలె సంభావించి, హితవు చెపుతూండాలి. —ఆర్యధర్మ.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగుదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్. —మహాభారతము.

## 46. నాగరికత

నాగరికతారంభం నుండి ఆస్తి చాల విశేషంగా అనేక రూపాలలో పెరిగి పోయింది. దాని వుపయోగాలు విస్తరించాయి. దాని స్వంతదారుల లాభంకోసం అది ఎంతో మెలుకువతో నిర్వహించబడుతూంది. ప్రజలకు సంబంధించినంతవరకు, లొంగదీయలేని మహాశక్తిగా అది తయారయింది. తాను సృష్టించిన మహాశక్తి ఎదుటనే మానవ మేధస్సు కరచణాలాడ కుండా అయింది. — మోర్గన్.

నాగరికత అనేది సమాజం యొక్క అభివృద్ధిక్రమంలో ఒక దశ...అసలు నాగరికత అనేది ఒక వర్గాన్ని మరొక వర్గం దోచుకోవడం అనే పద్ధతి మీద బయలుదేరింది. —ఫ్రెడరిక్ ఏంగెల్స్.

నిముష నిముషం తమ స్వేచ్ఛని, ఇన్‌స్టింక్ట్సుని, సరదాలని మర్యాదకోసం, పైకి పోకడంకోసం అర్పించే యీ విద్యా నాగరికులు ఎటువంటి చావులు చస్తున్నారో ఊహించడం వాళ్ళకే చాతకాదు. —చలం.

నిలిచి నీళ్లు త్రాగ నీళ్లుకాలు బ్రతుకు;
పరుగులెత్తపోయి పాలు త్రాగ;
పరుగునుండి పుట్టె నరుని నాగరికత. —నార్ల వెంకటేశ్వరరావు.

నాగరికత పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొన
ఆది మానవులలో ఒకడై బ్రతుకును పూజిస్తూ బ్రతికి
మానవ సేవయే మాధవ సేవగా యెంచి
ప్రపంచానికి బ్రతుకు బాట చూపిస్తూ
అమరత్వం సాధించిన మానవుడు ఆల్బర్ట్సుస్విట్జర్. —కాళోజీ.

## 47. న్యాయం

న్యాయం గెలుస్తుందన్న మాట నిజమే కాని
గెలిచిందంతా న్యాయం కాదు. —శ్రీశ్రీ.

చట్టబద్ధమైన న్యాయం కొరకు కోర్టులకెక్కడం, పిల్లిని రక్షించుకోవడానికి పాడి ఆవును పోగొట్టుకోవడంలా వుంటుంది. —చైనా సామెత.

అన్యాయాన్ని సహించడంకంటే అన్యాయం చేయడం మంచిది. ఈ సిద్ధాంతాన్ని ఎవరూ ఒప్పుకోరు. —అరిస్టాటిల్.

న్యాయశాస్త్రమన్నది బలవంతులు తమకిష్టమైన విధంగా ఉపయోగించుకునేందుకు సృష్టించుకున్న పరికరం. నీతి అమాయకులు కొలిచే ముప్పైమూడుకోట్ల దేవతలలాగ బలహీనుల భ్రమ. —హోవర్డ్ ఫాస్ట్.

ఏ విషయమైనను గుణదోషములబట్టి విచారించినపుడే సరియగు న్యాయము చేయగలము. —గాంధీజీ.

## 48. నీతి

వేడిమిని విడిచి బొగ్గెట్లగ్నిహోత్రమని పిలువబడదో మనుష్యుడు నీతిని విడిచిన తరువాత మనుష్యుడని పిలువబడ దగడు. —కందుకూరి వీరేశలింగం.

నీతికీ; మానవుల అంతర్బుద్ధికీ సంబంధం కలిగిస్తే, నీతి ఎప్పటికీ అస్పష్టమైన కలగా వుండి పోతుంది. ప్రపంచ పునర్నిర్మాణంలో నీతిని ఆధారపడదగిన అంశంగా చేయాలంటే, నీతి హేతుపరీక్షకు నిలబడగల ఆధారం కలిగి వుండాలి.
—యం. యన్. రాయ్.

నీతి మాలినయపుడు మన్నింపదగదు
గురులనైన మరెట్టి భూసురుల నైన. —అదిభట్ల నారాయణ దాసు.

నిద్రలో అందరి ముఖాలు నిజాయితీగానే వుంటాయి. మేల్కొన్నప్పుడు వాటిలో మంచి చెడ్డలు బయట పడతాయి. —డా. హోచిమిన్.

నీతులు సంఘం నెమ్మదిగా, శాంతంగా జరిగిపోవడానికి పెట్టిన కట్టుబాట్లు.
—చలం.

## 49. నేరము - శిక్ష

నేరం చేసినవాడిని శిక్షించడమే ప్రధానం కాదు - నేరం చేయటానికి ఏ పరిస్థితులు పురికొల్పుతున్నాయో వాటిని తొలగించడం ముఖ్యం.
—యం. యన్. రాయ్.

చంపినవాడు ఏ విధముగాను బాగుపడడానికి అవకాశమియ్యని ఉరిశిక్ష సర్వ విధాలా నింద్యమే. —ఉన్నవ లక్ష్మీనారాయణ.

నిరాదరణ తాండవించే గృహాలనుంచే నూటిలో 80 మంది నేరస్థులు వస్తున్నారు. —హెచ్. సి. అండర్సన్.

హత్యా నేరానికి ఏ అభాగ్యునికైనా ఉరిశిక్ష విధించిన జడ్జి విమర్శకుడు. కాని నేరస్తుని హృదయ దౌర్బల్యమును గ్రహించి తేలిక శిక్ష విధించితే అప్పుడు తను కవికి దగ్గరవుతాడు. —శరత్.

రాజశాసనము హస్తగతము జేసికొని ఇచ్ఛవచ్చినట్లు సంచరించువాడు నేరమొనరించువాడగును. —గాంధీజీ.

కాలు జారడం నేరం కాదు
కారణం తెలుసుకోకపోవడం ఘోరం. —శ్రీ శ్రీ.

## 50. పగ

పాడౌను దేశంబు పగమించినేని. —శ్రీనాథుడు.

పగ యుడుగ గోపముడుగును
పగ యుడుగు గోర్కెలుడుగుఁబర జన్మంబుల్
తగులుడుగు భేదము డిగినఁ
ద్రిగుణంబులు నుడుగు ముక్తి స్థిరమగు వేమా? —వేమన.

పగ యడగించు టెంతయు శుభంబది లెస్స యడుంగనే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుందెగ
మొదలెత్తి పోవఁబగ దీర్పగ వచ్చినఁ గ్రౌర్యమొందునే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా. —తిక్కన.

పగగలిగి బ్రతకటం, పామున్న ఇంట్లో బ్రతకటం ఒకటే.—తెలుగు సామెత.

## 51. పఠనం, పుస్తకం

వృద్ధులయినవారు ఆహార విషయంలో ఎలాంటి నియమాలు పాటించాలో అలాగే యువతరంవారు కూడా తాము చదివే పుస్తకాలను గురించి శ్రద్ధ వహించాలి. ఆహారాన్ని బాగా నమిలి జీర్ణం చేసుకోవాలే తప్ప, అంతా ఒకేసారి మింగెయ్యరాదు. అలాగే యువతరం కూడా తాము చదివిన దాన్ని పరిశీలించి తర్వాత ఆకళించుకోవాలి. —విన్‌స్టన్ చర్చిల్.

రకరకాల విత్తనాలు చల్లి పంటలు పండించినప్పుడే భూమి సారవంత మౌతుంది. లేకుంటె ఎంత సారవంతమైన నేల అయినా బీడుతోనే సమానం. అలాగే అనేక రకాల గ్రంథాలు చదవడంవల్ల మేధ సారవంత మౌతుంది. — ప్లినీ.

ఒక మహాత్ముని జీవిత సర్వస్వం ఒక ఉత్తమ గ్రంథం. —మిల్టన్.

మంచి రచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి
కొంచెం బాధపడాలి చించుకొన్నట్టుండాలి
మనస్సుకి జ్వరం రావాలి ఒళ్లు తిరగాలి
ఈ బాధలోంచి తేరుకొని బాగుపడాలి. —ఆరుద్ర.

చదివిన దానిని మననం చేయాలి, జీర్ణించుకోవాలి. అనంతరం ఆచరణలో మన జీవితానికి అంగముగా తయారుచేసుకోవాలి. — గాంధీజీ.

## 52. పత్రికలు, వార్తలు

లక్ష తుపాకులనైనా ఎదిరించగలను కానీ ఒక్క పత్రికను కూడా ఓడించలేను. —నెపోలియన్.

పుత్తడిగలవాని పుండు బాధైనను
వసుధలోన చాల వార్తకెక్కు
పేదవాని యింటి పెండ్లైన యెరుగరు. —వేమన.

సభలకేగి, అందు సమ్మానమునంది
వార్తకెక్కినంత కీర్తి రాదు
వార్త బ్రతుకు క్రొత్త వార్త పుట్టువఱకె

పత్రికొక్కటున్న పదివేల సైన్యము;
పత్రికొక్కటున్న మిత్రకోటి;
ప్రజకు రక్షలేదు పత్రిక లేకున్న

ప్రజల సరస నిలిచి ప్రధనమ్ము నడపుట
ప్రథమ ధర్మమోయి పత్రికలకు
ప్రజల గోల్వలేని పత్రిక లేలరా?

నీతి నియతిలేని నీచుని చేతిలో
పత్రికకుండెనేని ప్రజకు ముప్పు;
ఉండదగునె కత్తి చండాలు చేతిలో. —నార్ల వెంకటేశ్వరరావు.

## 53. పరలోకం

పరలోకమనే అసత్యభావన ప్రచారంలో జీవితాన్ని నరకప్రాయం చేసారు. ఈ వాదం నూటికి తొంభైతొమ్మిదిమందిని గొర్రెలుగానూ, మిగిలిన ఒకడిని వాళ్ళ రక్తాన్ని పీల్చే తోడేలుగానూ జేసింది.

—రాహుల్ సాంకృత్యాయన్.

పోయిన ప్రొద్దుశే మరల పొల్చెడు నట్టులు కాలధర్మమై
పోయిన వారె వెండియును బుట్టెదరు —శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

స్వర్గమంటే ఏమిటో మాకూ తెలుసు. మనస్సును సమాధాన పెట్టుకోవ డానికి ఈ కల్పన బాగానే వుంటుంది. —గాలిబ్.

జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ —ఆర్యోక్తి

## 54. పరోపకారం

పరహితంబుకునై పాపంబు చేసి
పురుషుడు కీడునఁ బొందడు నిజము
బగినగస్త్యుండు పరోపకారార్థ
మగు పాడిచేసి కృతార్థుడై మించె. —సోమన.

జపతపంబుల కన్న చదువు సాములకన్న
ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా!
—కూనలమ్మ పదాలు-శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము.

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ, వివరింపంగా,
యపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ. —సుమతీ శతకం.

స్వంత లాభము కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్. —గురజాడ అప్పారావు.

ఇతరులకు మేలు కోరుట, మేలు సేయుట, సేవలొనరించుటయే పరోప కారమున కర్థము. —గాంధీజీ.

## 55. పుట్టుక, చావు

చావు పుట్టుకలతోగూడిన యీ సంసారమందు చనిపోయిన వాడెవడూ తిరిగి పుట్టుట లేదు? కాని యెవ్వని పుట్టుకవలన వంశం కీర్తిగాంచుచున్నదో వాని పుట్టుకయే సార్థకము. —భర్తృహరి.

మరణమన్న వెరచి మది కలంగగనేల
నిరుడు ముందటేడు నిన్న మొన్న
తనువు వీడినతడు తనకన్న తక్కువా —వేమన.

......చచ్చిన వారికేడ్చినను
ఉరుమతి వత్తురే యో వెఱ్ఱులార. —సోమన.

జీవితంలో కలిగే వియోగాలకంటే చావువలన కలిగే ఎడబాటులో సుఖముంది. —గోల్డ్‌స్మిత్.

జనన మరణమ్ములు నాణె
మ్మున కిరుప్రక్కల వంటివి. —గాంధీజీ.

## 56. పొదుపు

కవిత్వంలోనూ, జీవితంలోనూ, Economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్న హీనమైన పాపం, ఆత్మలోకంలో దివాలా.
—చలం.

'పొదుపు అనేది మనపై మనం విధించుకునే పన్ను'.

డబ్బు ఉన్నప్పుడే పొదుపు నేర్చుకుంటే, దారిద్ర్యం మీ దరిదాపులకు రాదు. జిమ్మర్ మన్.

## 57. ప్రజలు

ప్రజలు తమ శక్తిని, ధర్మమును గుర్తెరిగి ప్రవర్తించిన సర్వము తనంతదా చక్కబడగలదు. —గాంధీజీ.

ప్రజల లోపాలను విమర్శించడం అవసరమే. కాని విమర్శించేటప్పుడు ప్రజల వైపున నిలబడి వారిని రక్షించడానికి, వారిని చైతన్యవంతులను చేయడానికి హృదయపూర్వకమైన ఆకాంక్షతోనే ఆ విమర్శ చేయాలి.
—మావో సేటుంగ్.

ప్రజల రాజ్యమందు పౌరులే ప్రభువులు
ప్రజల రాజ్య బలము పౌరబలము;
ప్రజల రాజ్యమన్న ప్రతిహతి లేదురా! —నార్ల వెంకటేశ్వరరావు.

ధనవంతుడిమీద బీద ప్రజ చేసే యుద్ధమంతా ఒక దగా! —డేవిడ్ మెకాల్నే.

దేశ పరిపాలనను ఒకరిద్దరి చేతుల్లో ఉంచడంకన్నా, శాసన నిర్మాణాన్ని పలువురు చేతుల్లో పెట్టడంకన్నా ప్రజలు చెయ్యగలిగిన గొప్ప పొరపాట్లు వేరే ఏవీ లేవు. —జోనాథన్‌స్విఫ్ట్.

## 58. ప్రజాస్వామ్యం, కమ్యూనిజం

కమ్యూనిజం శ్రామిక వర్గ సిద్ధాంతం యొక్క సంపూర్ణమైన విధానం మాత్రమే కాదు. అది ఒక నూతన సాంఘిక వ్యవస్థ కూడా. అది ఇతర సిద్ధాంత సాంఘిక వ్యవస్థలకు భిన్నమైనది. మానవ చరిత్రలో గతంలోని వ్యవస్థలకంటే కమ్యూనిజం పరిపూర్ణమైనది, అభివృద్ధికరమైనది. విప్లవకరమైనది, హేతుబద్ధమైనది. —మావో సేటుంగ్.

కమ్యూనిజంలో వుండే గొప్ప శక్తి ఏమంటే, ఏ విషయాన్నైనాసరే ఆరోగ్యం, విద్య, ఆర్థిక విధానము, దేవుడు, నీతి, దేనినైనాసరే-పాత బూజుల్ని దులిపి, ఈనాటి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలగడం.

—చలం.

సోషలిజము పెంచు సోదర భావమ్ము
సోషలిజము త్రుంచు సొదలనెల్ల;
సోషలిజము లేక శోభయే లేదురా! —నార్ల వెంకటేశ్వరరావు.

ప్రజలచేత, ప్రజలకొరకు ప్రజలదియైన ప్రభుత్వం-ప్రజాస్వామ్యం.
—అబ్రహాంలింకన్.

ప్రతి వ్యక్తికి అభివృద్ధి పొందుటకు అవకాశము కలిగించునదే ప్రజా రాజ్యమగును.
—గాంధీజీ.

## 59. ప్రపంచం

అగణిత దుఃఖాత్మక మిజ్జగము. —తిక్కన.

భూషింప మెచ్చులోకము
దూషింపం జంపఁజూచు
—బైచరాజు

మారిపోవడమే నియమంగా గలిగిన ఈ జగత్తుకు ఎవడో ఒకడు కర్తగానీ, లేక ఈశ్వరుడుకానీ-ఆధారం వుండాలనుకోవడం, ఉన్నాడనుకోవడం అవివేకం.
—రాహుల్ సాంకృత్యాయన్.

ప్రపంచమొక పద్మవ్యూహం. —శ్రీశ్రీ.

## 60. ప్రభుత్వం

ప్రజల రక్షణ భారం వహింతునని వాగ్దానం చేసి, రాజ్యపాలకుడై ఎవడైతే తద్విరుద్ధంగా ప్రవర్తిస్తాడో వాడు ప్రజా పరిషత్తుచేత ప్రమాదకరమైన పిచ్చికుక్కవలెనే హంతవ్యుడవుతున్నాడు. —మహాభారతం.

పరిపాలకులు ధర్మ మార్గమున ఉన్నచో ప్రజలూ ధర్మముగానే నడుచు కొంటారు. పాలకులనుబట్టియే ప్రజలు నడుచుకొంటూంటారు. యథారాజా తథాప్రజా: అనే సామెత అందువల్లనే పుట్టింది. —భోజచరితమ్.

ప్రజల పనియే పాలకుని పని; ప్రజల సుఖమే పాలకుని సుఖము; ప్రజల ప్రియమే పాలకుని ప్రియము; ప్రజల హితమే పాలకుని హితము. ఈ విధముగా ప్రజలతో అవినా భావముగా పాలకుడు ఉండవలెను.

—మహాభారతం.

"ఒక వ్యక్తిని మరొక వ్యక్తి చంపకుండా అరికట్టడం, ఉదరపోషణకు, ఎవరికిష్టమైన పనిపాటలు చేసుకునే అవకాశాలు వారికి కల్పించడం, కష్టపడి, చెమటోడ్చి సంపాదించుకున్న తిండిని నోటిదగ్గర పడగొట్టకుండా చూడటం- ఎంత ఆదర్శవంతమైన ప్రభుత్వమైనా చేయవలసినది ఇంతే".
కేవలం వ్యాపార మనస్తత్వంగల వ్యక్తుల చెప్పుచేతుల్లో వుండే ప్రభుత్వం అన్నిటికంటె అరిష్టదాయకం. —ఆడంస్మిత్,

## 61. ప్రవర్తన

తనకన్న ఉన్నతులు, తన సమానులూ, తన సేవకులూ, ఈ మూడు తరగతులవారితో ఏ పేచీ లేకుండా సవరించుకొని ప్రవర్తించేవాడే పెద్దమనిషి. —జోనాథన్ స్విఫ్ట్.

నీవు మెలకువగా వుండే రాత్రి మొదటి ఝామములో నీవు చేసిన తప్పుల గురించి ఆలోచించుకో. ఇతరుల లోపాల గురించి మాత్రం, నీవు నిద్రపోతున్న మిగతా మూడు ఝాములు ఆలోచించినా ఫర్వాలేదు.

—చైనా సామెత.

ఆదర్శం నిలుపుకోలేని మనిషి అభివృద్ధిని సాధించలేడు. —గోల్డ్‌స్మిత్.

ఒకరింటికి వెళ్ళినప్పుడు మొదటిసారికాదు—రెండోసారి వారి పిల్లలు మన యెడల ప్రవర్తించే తీరునిబట్టి మనయందు ఆ యింటి పెద్దలకి ఎంత ఆదర ముందో తెలుసుకోవచ్చు. —డేవిడ్ మెకాల్నే.

విడిపోయిన అధములు పగిలిన రాయిలా మళ్ళీ కలువలేరు. మధ్యములు బంగారంగా ఇతరుల ప్రయత్నంవలన కలిసిపోగలరు. ఉత్తములు నీటివలె తమంతట తామే మళ్ళీ కలుస్తారు. —అవ్వైయార్.

## 62. ప్రేమ

బంధాలెన్నో వున్నాయి లోకంలో. కాని ప్రేమబంధానికి చాలిందిలేదు. —చాణక్యుడు.

నేనీ జీవితాన్ని ఇంత ప్రేమిస్తున్నాను గనక
మృత్యువునీ అంతగా ప్రేమిస్తాను. —రవీంద్రనాథ టాగోర్.

ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమనిలిపిన ప్రేమ నిలుచును. —గురజాడ అప్పారావు.

వలపెరుంగక బ్రతికి కులికి మురిసేకంటే
వలచి విఫలమొంది విలపింప మేలురా! —బసవరాజు అప్పారావు.

తన అజాగ్రత్తవలన చెట్టుమీదనుండి క్రిందపడి కాళ్ళు, చేతులు విరగకొట్టుకొని భూమ్యాకర్షణవల్లనే తను పడ్డానని, దానిమీద నేరం మోపితే ఎంత మూర్ఖంగా వుంటుందో ప్రేమ కఠినమన్నా, ఘృణీభూతమన్నా అంత మూర్ఖంగా వుంటుంది. —శరత్.

## 63. బాధ్యతలు

సారపుధర్మమున్ విమలసత్యముఁ పాపముచేత బొంకు చేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసిరది వారల చేటగుఁగాని ధర్మ ని
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవముండెడున్. —తిక్కన.

దేహంకంటే ప్రేమా, సంఘం కంటే వ్యక్తి కళ్యాణము అధికము. —శరత్.

నేను సమాజానికి ఏమైనా చేసానా? ... అని ప్రశ్నించుకుంటే మన స్వంతానికి స్వార్థంతో చేస్తున్నదే కనిపిస్తుంది. కాని బాధ్యతలు మనసులో నిలిచి ఉంటే మనం సమాజానికి ఏమైనా చేయగలం. —సిమ్స్.

హక్కులపట్టిక లెక్క తప్పక - ఒప్పజెప్పెడి ఉత్సాహం
బాధ్యతలంటే బానిసత్వమని తర్కం
పనిలో తాత్సారం. —కాళోజి.

## 64. బాల్యం

బిడ్డలకు వర్ణమాల నేర్పుటకు ముందు ముఖతః ఎన్నియో విషయములను నేర్పవలసి యుండును. ద్రాత నేర్పకపూర్వమే వారికి చదువుట నేర్పవలెను. —గాంధీజీ

అసలు బ్రతుక్కి ఆనందపు పొలిమేర
పసితనంకాక మరేముంది చెప్పండి. —దాశరథి.

శిశువుల చిరునవ్వు ముందు
పశువు కొమ్ము వంచునులే. —డా. సి. నారాయణరెడ్డి.

నేటి బాలలే రేపటి పౌరులు.

## 65. భక్తి

ఏ ప్రాణిపట్లనైనా ద్వేషంలేనివాడు దయాళువు, మమతతో బుద్ధిశూన్యుడు, అహంకారం లేనివాడు సుఖ, దుఃఖాల్లో ఒకేవిధంగా వుండేవాడు, క్షమాశీలుడు, ఎప్పటికీ సంతోషంగా వుండేవాడు, సమాహిత చిత్తుడు, సమ్యత స్వభావుడు, తత్త్వవిషయాలపట్ల దృఢనిశ్చయం కలవాడు, మనస్సును, బుద్ధిని నాకర్పించినవాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు. —భగవద్గీత.

చక్రిచింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిలబుద్బుదంబుగాక. —పోతన.

క్రియఁగొన భక్తుండై బం
టయి బానిసయై నిజాప్తుడై యొక్కటఁ బెం
టయి తుడువగఁ జీపురుదా
నయి జంగమభక్తి సేయునతఁ డీశుఁడగున్. —పాల్కురికి సోమన.

భక్తితోడగల్గు పట్టెడన్నమె చాలు. —వేమన.

నరుని భక్తినుండి హరి యుద్భవించెను;
భయమునుండి పుట్టె భైరవుండు;
నరునిలోనె కలరు హరిహరులిద్దరు. —నార్ల వెంకటేశ్వరరావు.

## 66. భయం

ఆపదలందును శత్రు
వ్యాపారములందు భీతి వలదు. —శ్రీధరమల్లె వేంకటరామకవి.

భయము తొంగిచూడ పరువెత్తు మగసిరి;
భయమువెంట భూతచయము వచ్చు;
భయము నిలుచుచోట జయలక్ష్మి నిలువదు. —నార్ల వెంకటేశ్వరరావు.

భయం ఎప్పుడూ అజ్ఞానంనుండే ఉద్భవిస్తుంది. —ఎమర్సన్.

భయము తొలగినపిదప చీదరింపునకు తావుండదు. —గాంధీజీ.

## 67. భాష

దేశభాషలు వృద్ధిపొందినగాని దేశము స్థితి ఎన్నటికీ బాగుపడనేరదు. రాజకీయ భాష ఎంత అభివృద్ధిగాంచినను, అది ఎన్నటికీ దేశభాష కాజాలదు.
—కందుకూరి వీరేశలింగం.

మాతృభాషా తృణీకారము
మాతృదేవీ తిరస్కారము. —గాంధీజీ.

అన్యభాషపైని అధికారమబ్బదు
అంతుపట్టదేని సొంతభాష;
మొదలు నేర్వకున్న తుదనెట్లు నేర్చురా ? —నార్ల వెంకటేశ్వరరావు.

ఎంత దుఃఖదాయకమైన విషయముల చర్చించునప్పుడైనను కఠినభాష నుపయోగించరాదు. —గాంధీజీ.

కవిత్వం నా మాతృభాష. —డా. సి. నారాయణరెడ్డి.

## 68. భౌతిక వాదం

ఎట్టి అన్యపదార్థ మిశ్రణం లేకుండా ప్రకృతిని ఉన్నదున్నట్లు భావించడమే భౌతికవాద దృక్పథంతో చూడటం. —ఫ్రెడరిక్ ఏంగిల్స్.

సిద్ధాంతం, ప్రజాసామాన్యంపై పట్టు సంపాదించినవెంటనే అది ఒక భౌతిక శక్తి అవుతుంది. —కారల్ మార్క్స్.

మానవుడు అనాదినుంచి పొందుతున్న అనుభవం ఆధునిక విజ్ఞానశాస్త్రం భౌతిక వాదానికి పునాదిరాళ్ళు. మానవుని బుద్ధికి అందని విషయాలు లేవని భౌతికవాదం చెపుతుంది. అనాదినుంచి అజ్ఞానంతో, మూఢవిశ్వాసంతో నిర్మించుకున్న ఊహాప్రపంచాన్ని కల్పితమని రుజువుచేసి హేతుబద్ధమైన స్వతంత్ర ఆలోచనాశక్తిని భౌతికవాదం పెంపొందిస్తుంది.

—యం. యన్. రాయ్.

చైతన్యం, ఇంద్రియజ్ఞానం, అనుభవం- వీటికి సంబంధంలేని స్వతసిద్ధమైన బాహ్యాపుటునికిని (పదార్థం) సాధారణంగా భౌతికవాదం గుర్తించు తుంది... చైతన్యం ఉనికియొక్క ప్రతిబింబం మాత్రమే. మహాఅయితే దాదాపు దాని నిజమైన (తగిన, సంపూర్ణంగా ఖచ్చితమైన) ప్రతిబింబం.

—లెనిన్.

## 69. మతం

మతం మానవప్రగతికి మత్తుమందు. —లెనిన్.

ప్రస్తుతం చలామణీలోవున్న మతాలు, మోజస్, క్రీస్తు, మహమ్మద్ మొదలయిన వారందరి మతాల్ని నేను నిరాకరిస్తాను. అవి మానవుల్లో పరస్పర ద్వేషాల్ని పెంపొందించి, అసహనాన్ని అభివృద్ధిపరచడమేగాక, బయట ఎక్కడో వున్నాయనుకునే ఏవో శక్తులకు మానవుణ్ణి బానిసగా చేస్తున్నాయి. ఈ భ్రాంతులు నాశనం కావాలి. అప్పుడే పరస్పర వైరుధ్యాలు లేకుండా సామరస్యంతో తన సర్వశక్తులనూ అభివృద్ధిపరుచుకుంటూ తోటి మానవులు అభివృద్ధిచెందటానికి తోడ్పడే నూతన మానవుడు జన్మిస్తాడు. —మాగ్జింగోర్కీ.

అనాదినుంచీ మతాలు మనిషికీ మనిషికీ మధ్య మాయగోడలు నిర్మించాయే తప్ప మనుషులందర్నీ ఏ మతమూ ఒక్కటిగా చెయ్యలేకపోయింది. అలా

చేసే శక్తి ఏ మతానికీ లేదు. పైగా మనిషిమీద మనిషికుండవలసిన విశ్వాసాన్ని లేకుండాచేస్తుంది మతం. దేవుడనే హేతుదూరమైన భావాన్ని ఆరాధిస్తూ శాస్త్రీయ విజ్ఞానానికి పోటీగా మూఢవిశ్వాసాలను నిలబెడుతుంది. —శ్రీశ్రీ.

మతములనుచు పుట్టి మన్వంతరములాయె;
మనుజునందు మిగిలెదనుజ వృత్తి:
మతములెప్పుడింక మనుజుని పెంచురా? —నార్ల వెంకటేశ్వరరావు.

శ్రద్ధ మతమునకు మూలాధారము. అది లేకున్న మతమే లేదు.—గాంధీజీ.

ప్రకృతిని గూర్చిన భయమే మత సంస్థాపనకు దారితీసింది.

—బెర్ట్రండ్ రసెల్.

## 70. మేధావి

సుఖములందు పొంగుట, దుఃఖములందు క్రుంగుట లేనివాడును, ఇష్టానిష్టములు పోగొట్టుకున్నవాడును స్థితప్రజ్ఞుడని చెప్పబడును. —భగవద్గీత.

మేధావి అంటే ఎవరు? స్పష్టంగా చూడగలిగిన మనిషి. —జాన్‌సన్.

మేధావి అంటే ఆశ్చర్యపడేవాడు కాదు, ఆశ్చర్యపరచేవాడు.

—డేవిడ్ మెకళ్ళే.

అనేక విషయాలను కొద్దిమాటలలో చెప్పటం మేధావుల లక్షణం. విషయం అనేది లేకుండా మాటలు అల్లుకుపోవడం అల్పబుద్ధులకు లక్షణం.

—ఫ్రాంకాయిస్ డెలారోష్.

మేధావివర్గం అనేది ధనికస్వామ్యానికి ఊడిగం చేయటంద్వారానే తన ఉనికిని కాపాడుకుంటున్నది. వారి ఉద్యోగధర్మం ఏమిటి? ధనికవర్గానికి అపచారం చేయని భావాలనో, లేదా దానిని కీర్తించే భావాలనో ప్రచారం చేయటమే. —జాక్ లండన్.

## 71. మోసం

కాసువీసముల కోసము యాసతో
వేసము ధరియించి మోసము చెందని
యతడే ధన్యుడురా ఓ మనసా! —త్యాగరాజస్వామి.

ఒకడు నిన్ను ఒకసారి మోసగిస్తే అది వాడితప్పు. రెండుసార్లు మోసగిస్తే నీ తప్పు. —రుమేనియా సామెత.

తక్కువవాడు మోసంచేస్తే అది దారుణమైన నేరం. ప్రభుత్వాలూ; ప్రముఖులూ చేస్తే అది రాజకీయ తంత్రం, మంత్రాంగం.
—దేవులపల్లి కృష్ణశాస్త్రి.

తానె టక్కరినని తెగులూని యెరుని
మోసపుచ్చఁగ జనువాడు మోసపోవు. —ఆదిభట్ల నారాయణదాసు.

చూసిచూసి మోసాలకు తలఒగ్గడం, దోషాలవైపు మొగ్గడం. —ఆరుద్ర.

## 72. మోహం

నారీ కుచభర నాభి ప్రదేశమునుజూచి మోహావేశమును పొందకుము
అవన్నీ మాంసము; క్రొవ్వు మొదలయినవాని కారకములే.
—శంకరాచార్య.

అగ్ని పొగచేత కప్పబడుచున్నది; ప్రయత్నముచే నూదినచో మాయమై పోవుచున్నది. అద్దము మురికిచే కప్పబడియున్నది. కడిగినచో మురికి పోవుచున్నది. పిండము మావితో కప్పబడియున్నది. అట్లే జ్ఞానము కామము (కోరికల) చేత కప్పబడియున్నది. ఆ కామమును తీవ్ర వైరాగ్యముచేత. పోగొట్టవలయును. —భగవద్గీత.

అంధుడు గోతిలోపడితే లోకులు వాణ్ణి లేవదీయడానికి పరుగెత్తుతారు. కాని కామాంధుడు గోతిలో పడితే వాణ్ణి అందులోనే పూడ్చిపెడతారు.—శరత్.

మోహామే దాహాము సుండి
సాహాస సంసారమే నిస్సారము సుండి. —అన్నమయ్య.

## 73. మోక్షం

బంధానికైనా మోక్షానికైనా మనస్సే కారణం. —భగవద్గీత.

మోహాము విడుచుటే మోక్షము. —అన్నమయ్య.

చికిత్సాశాస్త్రమున నాలుగు వ్యూహములున్నవి. రోగమననేమి ? రోగహేతువేది ? ఆరోగ్యమననేమి ? ఆరోగ్యమునకుపాయము అనగా చికిత్స

ఏది ? అట్లే వేదాంత శాస్త్రమున కూడ నాలుగు వ్యూహములు : సంసారమన నేమి ? సంసారహేతువేది ? మోక్షమననేది ? మోక్షోపాయమేది ? అని. ఇది వ్యాసుల వారి వివరణము. —నైష్కర్మ్యసిద్ధి.

కామిగాక మోక్షకామిగాడు. —వేమన.

## 74. మౌనం

...తర్కవాదములాడి దారి తప్పి
మాటలాడుట కంటె మౌనంబు బహుమేలు. —వేమన.

తననితాను నమ్మనివాడు మౌనవ్రతం పూనడమే మంచిది.
—ఫ్రాంకాయిస్ డెలారోష్.

మౌనం నిద్రలాంటిది. ఎందుకంటే, అది బుద్ధిని వాడిపోనివ్వదు. —బేకన్.

అలజడితో చల్లారదు అలజడి
మౌనమ్మొకటే దాని నణచునది. —గాంధీజీ.

## 75. యువత

ఎవరు మాట్లాడినా, యోచించినా, లోకం వంక చూసి ఆలోచించే వాడెవడూ, ఆ కమ్యూనిజం భావాల్ని వదలి మాట్లాడితే, ఆ మాటల్ని ఓ లెక్కలోకి తీసుకోవలసిన అవసరంలేదు యువకులకి. —చలం.

కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు
పేర్లకీ, పుకార్లకీ, పకీర్లకీ నిబద్ధులు
నాన్నగారి తాతగారి భావాలకు దాసులు
నేటి నిజం చూడలేని కీటక సన్యాసులు.

... ... ...

కొంతమంది యువకులు రాబోవు యుగం దూతలు
పావన నవజీవన బృందావన నిర్మాతలు. —శ్రీశ్రీ.

ప్రతి యువకునిలోను కొంతైనా వృద్ధాప్యం కనిపించాలి. ప్రతి వృద్ధుడిలోనూ కొంతైనా యౌవనం కనిపించాలి. ఈ సూత్రాన్ని అమలుపరచిన

వ్యక్తి వయస్సునుబట్టి వృద్ధుడైనా. మనస్సునుబట్టి యువకుడుగానే జీవించ గలడు. —సిసిరో.

యువత నిరంతరమైకములో వుంటుంది. అయితే అది హేతువాద జ్వర తీవ్రతవలన కలిగినట్టిది. —రోష్ ఫోకాల్డ్.

## 76. యౌవనం

యౌవనము దోషములకెల్ల నాస్పదంబు. —శ్రీనాథుడు.

యౌవనము భోగములకెల్ల నాస్పదంబు. — కేతన.

యౌవనం ప్రేమను చుంబిస్తుంది. అంతకన్న తీయనిదీ, సుదీర్ఘమైనదీ వేరొకటి వుండదు. —బైరన్.

యౌవనదశలో వున్న వ్యక్తి తనంతవాడు లేనట్లున్నూ తన అనుభవమంత అమూల్యమైనది లేనట్లున్నూ, లోక రంగంలో తానే నాయకుడై నట్లున్నూ అనుకుంటాడు. సాక్షిగా, తటస్థుడిగా ఈ లోకాన్ని చూడలేడు. అనుభవంవైపు మొగ్గినంత ఆలోచనవైపు మొగ్గడు......ఈ యవస్థలో వున్న జాతి కూడా తనంత గొప్పదీ, లోపం లేనిదీ లేదనుకుంటుంది. —దేవులపల్లి కృష్ణశాస్త్రి.

యౌవనము మనోవికారముల జయించుటకే లభించినది. దానిని వ్యర్థము చేయరాదు. —గాంధీజీ.

## 77. రాజకీయాలు

విప్లవ సిద్ధాంతమూ, చారిత్రక అవగాహన, ఆచరణలో ఉద్యమంపై లోతైన పటు లేకుండా ఏ రాజకీయ పార్టీగాని, విప్లవోద్యమాన్ని విజయం వైపు నడిపించలేదు. —మావోసేటుంగ్.

రెండురకాల వ్యక్తులు రాజకీయాలలో గొప్పగా రాణిస్తారు. ప్రవర్తన లేక పోయినా ప్రతిభ వున్నవారు, ప్రతిభలేక పోయినా పైవారి క్రింద అణగి మణగి వుండేవారు. —వెండెల్ ఫిలిప్స్.

తన పదవిని నిలుపుకోవటానికి రాజకీయ వాది ఏమైనా చేయగలడు. దేశ భక్తుడు కూడా కాగలడు. —విలియం రుండాల్ఫ హెర్స్

ఒక వర్గం యొక్క రాజకీయాధికారాన్ని ఆర్థికాధికారాన్ని కూలద్రోసి, దానిస్థానే అంత వరకు దానిచేత దోపిడి చేయబడుతూ, అణచబడుతూ వచ్చిన వర్గం లేదా వర్గాలు రాజకీయాధికారాన్ని కైవసం చేసుకొని నూతన ఆర్థిక వ్యవస్థను, నూతన రాజకీయ, సామాజిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరణ చేయడమే రాజకీయాలు. —పుచ్చలపల్లి సుందరయ్య.

పట్టు విడుపు లెఱిగి, కట్టడి చెడకుండ
గట్టి చిక్కునైన నెట్టి వేయు
దిట్ట తనము లేక దేశనాయకుడౌనె ? —నార్ల వెంకటేశ్వరరావు.

## 78. లోభత్వం

గొడ్డుటావు బిదుకఁ గుండ గొంపోయినఁ
బండ్ల నూడఁ దన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా. —వేమన.

లోభివానిజంప లోకంబు లోపల
మందు వలదు వేలు మతము గలదు
పైక మడుగఁజాలు భగ్గున బడిచచ్చు. —వేమన.

లోభత్వము కూడా ఒక అంటురోగమే. —శరత్.

పసిడి కూడబెట్టుకునే పిసినిగొట్టు జీవితం
సమాధిలో లుకలుకమను క్రిములకు రూపాంతం. —ఖలీల్ జీబ్రాన్.

## 79. వార్ధక్యం

రెండవ బాల్యము సుమ్ముముదిమి. —తిరుపతి వేంకట కవులు.

ప్రతి మనిషీ నిండు నూరేళ్లు బ్రతకాలని కోరుకుంటాడు. కానీ ముసలితనాన్ని మాత్రం ఏ వ్యక్తీ కోరుకోడు. —జోనాథన్ స్విఫ్ట్

వయస్సు మీదపడుతున్నకొద్దీ జీవిత సౌఖ్యం తగ్గిపోతుంది. —గోల్డుస్మిత్.

ఒక వృద్ధుడు తానింతకాలం బ్రతికానని చూపించుకోవడానికి, తన వయస్సు తప్ప యింకేమీ లేకపోయినప్పుడు, అంతకన్నా అవమానం అతనికి ఇంకేదీ వుండదు. —సెనేకా.

వయసు పెరిగినంత మాత్రాన పెద్దతనంరాదు ముసలితనం వస్తుంది.
—జాన్‌సన్.

## 80. విద్య

విద్యనిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్యగురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము విద్య నెఱుంగనివాడు మర్త్యుఁడే. —భర్తృహరి.

విద్య యొసగును వినయంబు వినయమునను
బడయు పాత్రత పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబులందు నరుడు. —చిన్నయసూరి.

పుస్తకములందున్న జ్ఞానము, ఇతరుల వద్దనుంచిన ధనము యివి, సమయానికి అక్కరకు రావు. —చాణక్యుడు.

పాలరాతి శిల్పం ఎటువంటిదో మనిషికి విద్యాభ్యాసం అటువంటిది. భూగర్భంలో దాగిన రాతి బండల్లా మరుగునపడివున్న మనుషుల్ని వెలికి తీసి మహాపండితులుగా; వీరాధివీరులుగా, తత్త్వవేత్తలుగా తీర్చిదిద్దగలిగే శక్తి విద్యా సంస్కారాలకు మాత్రమే వుంది. —జాన్‌సన్.

విద్య అనే ఈ సముద్రాన్ని తరచినకొలదీ దీని వైశాల్యం మరీ మరీ ఎక్కువ అవుతుంది. —రాహుల్ సాంకృత్యాయన్.

సన్నుతంబగు విద్యచాలు నొక్కటియె. —గౌరన.

## 81. వివాహం

నీవు ప్రేమించిన వారిని వివాహం చేసుకోకు
నిన్ను ప్రేమించిన వారిని వివాహం చేసుకోకు.

శుభ్రంగా పెళ్ళి చేసుకో, పెళ్లాం అనుకూలవతి అయిందా సుఖపడతావ్. కాదూ! వేదాంతివవుతావ్. —సోక్రటీసు.

మెచ్చి మేనరికంబు ఇచ్చేటి కంటె - మెడకోసి నూతిలో వేసితే మేలు
లేకుంటె గంగలో కలిపితే మేలు.
—(తెలుగు పాటలు - ప్రయాగనరసింహశాస్త్రి సంకలితము).

వివాహం చేసుకోవడం కర్తవ్యం. అయితే రెండవ పెండ్లి చేసుకుంటే మాత్రం అది లాలసత. మూడో పెండ్లి అయితే ఉన్మాదం. —సామెత.

## 82. వృత్తి, ప్రవృత్తి

రచనావ్యాసాంగం జీవితంకాదు జీవితంనుంచి పలాయనం కాదు. అది ఒక వృత్తి. ప్రవృత్తికి కొంత విద్య, కృషి, శిక్షణ, నిజాయితీ, బాధ్యత అవసరం.
—జీన్‌పాల్ సార్త్రే.

'కులవృత్తి సాటిరాదు గువ్వల చెన్నా!'

పాకీవాడు, చెప్పులుకుట్టువాడు, మున్నగు ప్లేరపయి నా కేమియు ఏవగింపు లేదు. ఈ వృత్తు లన్నింటిని నేను స్వయముగ చేయుచు ఇతరులను గూడ చేయ ప్రేరేపించుచుందును. ఇట్లు చేయుటలోనే ఆనందము పొందు చుందును. —గాంధీజీ.

## 83. వైరాగ్యం

విరక్తుడు ఒక్క మాటలో అధైర్యపరచగలడు. —ఎమర్సన్.

కొండగుహల్లో, కారడవుల్లో వున్నంతమాత్రాన, కాషాయవస్త్రాలు ధరించి నంత మాత్రాన ఆశాపాశబద్ధుడు యోగికాలేడు. —శంకరాచార్య.

యోగము గల్గినచోటను భోగంబులు లేవు
భోగములు గల్గినచో యోగంబు లేదు. —వెన్నలకంటి సూరన.

ఎవడు పర్మేశ్వరుని చరణసన్నిధిలో మనసు నిలిపి ఆశారహితుడై యుంటాడో వాడే మహాయోగి. —శంకరాచార్య.

## 84. వ్యక్తిత్వం, గుణాలు

గొప్ప వ్యక్తులు ఆశయాలకై జీవిస్తే, దుర్బలులు ఆశలకొరకు జీవిస్తారు.
—చైనా సామెత.

వత్తి సరిగా చూడకపోతే దేవుడి దగ్గర పెట్టిన దీపమయినా ఆరిపోతుంది. వంశానుగతమైన సద్గుణాలూ ఒక పటాన వదలవు. కష్టపడి వాటిని, నిలబెట్టుకొనకపోతే అవి విడిచిపెట్టి వెళ్ళిపోతాయి. —తిరుక్కురల్.

ఇరవై యేళ్ళ వయస్సులో 'నా ఇష్టం' అనేది రాజ్యం చేస్తుంది. ముప్ఫయిలో 'వివేకం' చోటు చేసుకొంటుంది. నలభై వచ్చాకగానీ 'ఏది న్యాయం' 'ఏది అన్యాయం' 'ఏది సత్యం' 'ఏది అసత్యం' అనే విచక్షణ ఏర్పడదు. —గ్రాటియస్.

సజ్జన దుర్జనులు జగమందు కలిసే జన్మిస్తారు; కానీ తామరపువ్వుకీ జలగకీ ఉన్నట్లు గుణాలు మాత్రం వేరుగా వుంటాయి. —తులసీదాసు.

తనను నరికేవరకూ చెట్టు మానవునకు నీడనూ, ఫలాల్నూ ఇస్తూనే వుంటుంది. గొప్పవారు తాము మరణించేవరకూ దుర్జనులక్కూడా మేలు చేస్తూనే వుంటారు. —అవ్వైయార్.

ఉత్తముడు మాటల్లో మూగిగానూ, చేతల్లో చురుకుగానూ వుంటాడు. —కన్ఫ్యూషియస్.

## 85. వ్యసనాలు

వెలది జూదంబు పానంబు వేఁటపలుకు
ప్రల్లదంబును దండంబు పరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁజనదుతగుల. —తిక్కన.

సారాయి త్రాగుట సభకు యోగ్యతకాదు. —వేమన.

జూదమూ, వాదమూ వేదనను కల్గిస్తాయి. —అవ్వైయార్.

తడిసి మోపెడైన తర్వాతనే కాని
జూదగొండి పాఱజూచుకొనడు ;
జూదగొండితనము జోగిని చేయురా ! —నార్ల వెంకటేశ్వరరావు.

మద్యపానము, దొంగతనము—వ్యభిచారములకంటె మిక్కిలి నింద్యమని నా తలంపు. తరచు ఈ సద్గుణములకు అది జన్మదాతయే కదా ! —గాంధీజీ.

## 86. వ్యాధులు, వైద్యం

ఈ ఆస్పత్రులు ఉద్యోగుల జీతాలు ముట్టడంకోసం పుట్టినవేగాని రోగుల వ్యాధులను కుదర్చడానికి కాదు. —ఉన్నవ లక్ష్మీనారాయణ.

చికిత్సకుడు కేవలం చికిత్స చేస్తాడు. ప్రకృతి పూర్తిగా బాగుచేస్తుంది.
—అరిస్టాటిల్.

బలహీనత అనే వ్యాధికి చికిత్సలేదు. —ఫ్రాంకాయిస్ డెలారోష్.

భోగలాలసతే ఒక నిజమైన వ్యాధి. దుఃఖమూ, బాధే, దానికి సరిఅయిన చికిత్స —గాంధీజీ.

## 87. శత్రువు

కంటికి నిద్రవచ్చునే? సుఖంబిడునే రతికేళి? జిహ్వాకున్ వంటక మించునే? యితర వైభవముల్ పదివేలు మానసంబంటునె? మానుషంబుగల యట్టి మనుష్యున కెట్టివానికిన్ గంటకుఁడైన శాత్రవుడొకండు దనంతటివాడు గల్గినన్. —శ్రీనాథుడు.

నీవు నీ శత్రువుకొరకు రగిల్చిన మంటలు మూడు వంతులు నిన్నే కాల్చేస్తాయి. —చైనా సామెత.

శత్రువుతో పోట్లాడటం కాని, వాడికి పోట్లాడే విధానాన్ని తెలియజేయడం కాని అంత బుద్ధితక్కువ యింకోటి లేదు. —నెపోలియన్.

సాయుధులైన శత్రువులు తుడిచివేయబడిన తరువాత గూడా సాయుధులు కాని శత్రువులు యింకా మిగిలే వుంటారు. ఈశత్రువులు మనకు వ్యతిరేకంగా తెగించి పోరాడుతారు. మనం వీరిని గురించి తక్కువ అంచనా వేయ కూడదు. ఈ సమస్యను మనం ఈ రూపంలో లేవనెత్తి అర్థం చేసుకోకపోతే మనం చాలా ప్రమాదకరమైన తప్పులు చేస్తాం. —మావో సేటుంగ్.

మనోవికారములే నిజమైన శత్రువులని గ్రహించి వానితో నిత్యము పోరా టము సలుపవలయును. —గాంధీజీ.

## 88. శాంతి-సమరం

పోరు మంచిదికాదు భూమి నెక్కడను. —శ్రీనాథుడు.

హర్మ్యమందు శోకమ్మున నడలుకంటె
శాంతిదాయక కానన స్థలమె మేలు. —దువ్వూరి రామిరెడ్డి.

దాంతునకైన వేదాంతునకైన
శాంతము లేక సౌఖ్యము లేదు. —త్యాగరాజు.

యుద్ధము చేయనిచో చావు తప్పదనిన్నీ, యుద్ధము చేసినచో బ్రతుకు సంశయాస్పదమనిన్నీ ఎప్పుడు నిశ్చయమవుతూందో అదే యుద్ధమునకు అదను అని బుద్ధిమంతులు చెపుతారు. —నీతిసారః.

యుద్ధాలలో కూడా సాయుధ బలంకన్న నైతికబలమే నాలుగింట మూడు వంతులు విజయానికి సహాయపడుతుంది. —నెపోలియన్.

వర్గాల, జాతుల, రాజ్యాల లేదా రాజకీయ గ్రూపుల మధ్య వైరుధ్యాలు ఒక స్థాయికి అభివృద్ధి చెందినపుడు వాటిని పరిష్కరించుకోవడానికి జరిగే పోరాట రూపాల్లో యుద్ధం అత్యున్నతమైన రూపం. వర్గాలు ఏర్పడినప్పటినుండి యుద్ధాలు జరుగుతూనే వున్నాయి.

—మావో సేటుంగ్.

ప్రపంచం మొత్తంమీద శాంతిని తీసుకురావడమనేది అతి కష్టమైన ప్రయత్నం. అయినా, ప్రతి వ్యక్తిలో శాంతిని తీసుకురావడమనే ప్రయత్నం కన్న అది సులభం. ఏ శాంతిని ప్రపంచానికి తీసుకొని వచ్చినా, వ్యక్తి మారంది ఆ శాంతి నిలువదు. తన అశాంతిలో వ్యక్తి ప్రపంచ శాంతిని కూలతన్నుకుంటాడు. —చలం.

శాంతి అంటే ఏమిటి ? రెండు యుద్ధాల మధ్య వ్యవధి. —బెర్నార్డ్ షా.

అందరూ యోధులే జీవిత సమరంలో—
కొందరు అగ్రసరులు కొందరు అనుచరులు —ఖలీల్ జీబ్రాన్.

## 89. సత్యం

సర్వతీర్థాభి గమనంబు సర్వవేద, సమధిగమము
సత్యంబుతో సరియుఁగావ
యెఱుగు మెల్ల ధర్మంబులకెందుఁ బెద్ద.
యంద్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు. —నన్నయ.

ఎవరి పర్సనాలిటీలోనో, వాక్కులోనో, ధనంలోనో, కలంలోనో, ఎక్కువ బలం, కళ, శ్రావ్యం వుంటుందో, ఎవరు చెప్పేది ప్రజలకు ఉపయోగకరంగా తోస్తుందో అది ఆ నాటికి సత్యమౌతుంది. —చలం

సత్యం వల్లనే భూమి స్థిరంగావుంది. సత్యంవల్లనే సూర్యుడు తపిస్తున్నాడు. సత్యం వల్లనే గాలివీస్తుంది. సత్యంవల్లనే జగత్తంతా నిలిచివుంది.

—చాణక్యుడు.

అసత్యం చెప్పటం పిరికితనానికి చిహ్నం. —జాన్సన్.

నిజముంబలికెడునరులకు
విజయముగలదెందు. వేమన.

సత్యమ్మొకవంక విశ్వసామ్రాజ్యమ్మొకవంక
నిలిపిన ; సత్యమ్మే వరణీయమౌనులే మనసా ! —గాంధీజీ.

గరిమతగ్గి నిజము మఱుగునబడిపోవు
తిరిగి తిరిగి ఋజువు పఱుపకున్న;
పసిడికైన వలయు పలుమార్లు మెఱుగులు. —నార్ల వెంకటేశ్వరరావు.

సత్యమేవజయతే.

సత్యమహాసౌధానికి లెక్కలేని తలుపులు
తట్టిన వారందరికీ స్వాగతాల పిలుపులు. —ఖలీల్ జిబ్రాన్.

## 90. సంఘం

ఎచ్చట అందరూ పెత్తనం వహించవలెననుకొందురో, ఎక్కడ అందరూ తాము పండితులమేననుకొందురో, ఏ సంఘమున సర్వులూ గొప్పతనమును ఆరోపించుకొందురో, ఆ దేశము, ఆ సంఘం నశించును. —సూక్తి.

చేతిలో డబ్బున్నవాడిని, శరీరములో బలమున్నవాడిని సంఘం ఏమీ చేయలేదు. —శరత్.

నరుని గుండె నిబ్బరమును
పరీక్షించు గీటురాయి
మంచుకొండ అంచుకాదు
మానవ సంఘమ్మోయి. —గాంధీజీ.

సంఘమందు పుట్టి, సంఘమందు పెరుగు
సంఘజీవి కాడె సభ్య నరుడు?
సంఘ వృద్ధిలేక స్వాభివృద్ధియు లేదు. —నార్ల వెంకటేశ్వరరావు.

వర్గాతీతమైన సంఘంలోనే సాహిత్యం వికసిస్తుంది. —జీన్‌పాల్ సార్త్రే.

సమాజము మనలను తయారు చేయదు. మనమే సమాజమును నిర్మింతుము.
—గాంధీజీ.

## 91. సంతోషం

హృదయ వచశ్శరీరముల నెంతయు (బుణ్య సుధా ప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూ(డు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధు సద్గుణ లవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాస యుక్తులగు మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్.
—భర్తృహరి.

సంతోషమనేది నీడను సృష్టించని అతి సన్నని సూర్యకిరణం లాంటిది. కానీ దుఃఖం వరదల్ని సృష్టించే జడివాన. —చైనా సామెత.

నిజమైన సంతోషంకొరకు బయట ఎక్కడా వెదుకాడకు. అది నీ అంతరాత్మలోనే వుంటుంది. —సెనేకా.

సంతోషమే సగం బలం. —తెలుగు సామెత.

## 92. సంప్రదాయం

సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా
మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం
కాని, సంప్రదాయం తాత ముత్తాతల నాటి ధనం. —శ్రీశ్రీ.

అంత కడివెడుపాలపై ఒక్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి మంచి; అదియె సంప్రదాయము.
—డా. సి. నారాయణరెడ్డి.

సడలిపోవుచుండె సంప్రదాయమనుచు
సణుగు వెనుకనుండి ఛాందసుండు
సంప్రదాయమిసుప సంకెల కారాదు. —నార్ల వెంకటేశ్వరరావు.

## 93. సంభాషణ

కోకిలమ్మ చేసికొన్న పుణ్యంబేమి !
కాకి చేసుకొన్న కర్మమేమి ;
మధురభాషణమున మర్యాద ప్రాప్తించు. —"కరుణశ్రీ".

"సత్యమునే పలుకవలెను
ప్రియముగనే పలుకవలెను"—కాని సత్యమని చెప్పి
అప్రియమును పలుకకూడదు. —ఆర్యోక్తి.

నెలరోజులు గ్రంథ పఠనంతో సంపాదించే జ్ఞానాన్ని పండితుడితో గంట కాలం సంభాషించడంతోనే పొందవచ్చు. —చైనా సామెత.

మౌనం గొప్ప సంభాషణం. —హాజ్‌లిట్.

సంభాషణ విద్యార్థికొక ప్రయోగశాలే కాక ఆరాధనీయం. —ఎమర్సన్.

## 94. సంస్కరణ

స్వేచ్ఛగ తోచినట్లెల్ల చేయుట సంఘసంస్కరణ కాజాలదు. దానివలన మన సమాజ మున్నతిని పొందదు సరికదా అధోగతిని పొందును. —గాంధీజీ.

ఒక మనిషిని సంస్కరించదలిస్తే అతని తాతలదగ్గర్నుంచి ప్రారంభించు. —విక్టర్ హ్యూగో.

"సరియైనది, శుభప్రదమైనది," అని తలచినపనిని చేయుటలోనే మనకు సుఖము, శాంతి కలవు. ఆత్మసంస్కరణవలన వికాసము కలుగువలెను. — గాంధీజీ.

## 95. సృష్టి

మూర్ఖులైన నూరుగురు పుత్రులకంటె గుణశాలియైనవా డొక్కడే చాలు. చంద్రు డొక్కడే చీకటులను పారద్రోలుచున్నాడు. కాని కోట్ల నక్షత్రము లుండిన్నీ ప్రయోజనమేమి ? —హితోపదేశం.

సకలైశ్వర్య సమృద్ధులు
నొకతల సంతానలాభ మొకతల. —శ్రీనాథుడు.

పిడికెడు విత్తనాలు మడికెల్ల చాలు
ఒక్కడే కొడుకైన వంశానచాలు.
నెలయేరు పాటలు - సేకరణ : నేదునూరి గంగాధరం.

రక్షించుటకు శక్తిలేనిచో సృష్టించుట మహాపాతకము. —కట్టమంచి రామలింగారెడ్డి.

## 96. సహనం

సహనం లేక ఓపిక అనేది ఒక మహత్తర శక్తి. కాలాన్నీ, సహనాన్ని రంగరించి పట్టుపురుగు, ఉప్పునేరేడు ఆకును వెలలేని పట్టుదారంగా మార్చ గలుగుతూ వుంది. —చైనా సామెత.

ఓరిమి విడనాడకుడు. ఓరిమిలేకుండ నొక్క నిముషమేని సంఘ సంస్కర్తలయు, సేవకులయు పని సాగనేరదని జ్ఞాపకముంచుకొనవలెను. ఓరిమి ఫలితము మధురము. ఓరిమి కలిగియుండుడు సర్వము చక్కబడును. —గాంధీజీ.

పగతీర్చుకుంటే ఆ రోజు మాత్రమే ఆనందం కలుగుతుంది. ఓర్పు చిర కాలం నిలబడే కీర్తిని యిస్తుంది. ఒకరోజు ఆనందంకోసం చిరకాలం కలిగే ఆనందాన్ని బలిపెట్టరాదు. —తిరుక్కురల్.

సహనమే సంస్కృతి. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్.

## 97. సాహిత్యం

సాహిత్యం ద్వారా సంస్కారానికి పూనుకునే రచయిత మొదట తన్ను తాను పరీక్షించుకొని తన నిజాయితీ, శీలం, వ్యక్తిత్వంపట్ల నమ్మకం కలిగిన తరువాతే అందుకు అర్హుడు. —గోపీచంద్.

ఆత్మను తృప్తిపరచడమే సాహిత్య ప్రయోజనం అనడం అబద్ధం, ఆత్మను మేలుకొల్పి ఉద్దీపింప చేయడమే సాహిత్యం కనీసం చేయదగినది. —మాగ్జిం గోర్కి.

సాహిత్యం రెండు రకాలు-చదువడానికి పనికిరాని (బహుళంగా చదువ బడే!) చెడ్డ సాహిత్యం. రెండోది ఎవరూ చదవని మంచి సాహిత్యం. —జీన్‌పాల్‌సాత్రే.

సాహిత్యాన్ని—ఏ కోవకు చెందినదైనాసరే ప్రచారంకోసం ఉద్దేశించినదే ననటం సరియైనదేగానీ ప్రచారంకోసం ఉద్దేశించిన ప్రతిదీ 'సాహిత్యం' మాత్రం కాజాలదు. —లుసన్.

## 98. స్వార్థం

స్వార్థపరులకుం గడ్డిది కూడిది యటంచు గనరాదు సుమీ

—దాసు శ్రీరాములు.

స్వార్థమ్మెన్నాటికైన పరమార్థమ్మెనా?
గుంటనక్క ఎన్నడైన కొదమ సింగమేనా? —గాంధీజీ.

స్వార్థచింతన మెండు శైశవావస్థలో; మెండు, తిరిగి, వయసు పండినపుడు; నిండు జవ్వనాన నిస్వార్థ ముండురా. —నార్ల వెంకటేశ్వరరావు.

స్వార్థామృత సిద్ధికొరకు ప్రపంచ సముద్రం మధ్య ప్రజా మేరువు చుట్టూ 'పాలసీ'ల పాము చుట్టి మహా మహా మేధావులు మ థ నం చేయుచు నుందురు. —కాళోజీ.

స్వార్థపరత దాల్చు ఛద్మ వేషంబులు;
స్వార్థపరత చేయు శాస్త్ర చర్చ;
స్వార్థపరత లోక సంగ్రహమ్ముగ జెల్లు —నార్ల వెంకటేశ్వరరావు.

## 99. స్త్రీ

మగని కాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖము బొందు —వేమన.

స్త్రీలను స్త్రీలు చాలా తొందరగా గుర్తిస్తారు. —శరత్.

నూరు మంది పురుషులు చేరినచోట వొక బస ఏర్పడుతుందేమో కాని, ఆడది లేనిదే ఒక్క గృహాన్ని నీవు సృష్టించలేవు. —చైనా సామెత.

స్త్రీ ఔన్నత్యము, అవనతముపైనే రాష్ట్రౌన్నత్యమూ, అవనతమూ ఆధారపడి వుంటుంది. —అరిస్టాటిల్.

గృహ కృత్యములందు దాసిగాను, కార్యాలోచనలందు మంత్రిగాను, రూప సంపదలందు లక్ష్మీదేవిగాను, ఓ రి మి యం దు భూదేవి వలెను, స్నేహమునందు తల్లికివలెను, కూటమియందు వేశ్యవలెను వర్తించు నేర్పరిగనున్నదే కులపత్ని యననగును. —పంచతంత్రమ్.

గడనగల పురుషుఁగనుగొని
యడుగులకు మడుఁగు లిడుదురతివలు ధరలో —వేమన.

ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు ఆనందంతో ఆడుతారు. —ఆర్యోక్తి.

## 100. స్నేహం

ఆపదలకు సఖుఁడైనట్లు చుట్ట
మాపాటిగా నేరఁడారసిచూడ. —గోన బుద్ధారెడ్డి.

స్నేహానికి కాలంగుర్తు. అతిత్వరగా ఏర్పడిన స్నేహాలు అదే వేగంతో మాసిపోతాయి. —కాల్టన్.

నీ మిత్రుడిపైన నీకుగల నిజమైన అభిప్రాయం ఆ మిత్రుడి దగ్గర నుండి వచ్చిన ఉత్తరం అందుకున్న క్షణాన కలిగిన అనుభూతిని బట్టి వుంటుంది. —డేవిడ్ మెకల్నే.

చెడు స్నేహం చెదపురుగు వంటిది. చెదపట్టిన గోడను కూల్చినట్లే, చెడు స్నేహం మిత్రుల పతనానికి దోహదం చేస్తుంది. మంచి స్నేహం స్తంభాల వంటిది. అది బలంగా నిలబడి సహాయం చేస్తుంది. —బర్టన్.

తరుగు పెరుగులమాట ఎరుగునా స్నేహంబు?
స్నిగ్ధతను వీడు నా స్నేహమెప్పుడైన? —కాళోజీ.

## 101. హక్కులు

హక్కులనేవి వాటిని కాపాడుకోగలిగే శక్తివున్నవారికే వుంటాయి.
—యోజన.

ప్రజల కుండవలెను పరిపాలకులనైన
దుయ్యబట్టగల్గు దొడ్డహక్కు;
భంగపడును స్వేచ్ఛ వాగ్బంధమున్నచో. —నార్ల వెంకటేశ్వరరావు.

ఆత్మరక్షణ ప్రతి మానవుని జన్మహక్కు —గాంధీజీ.

స్వరాజ్యం నా జన్మ హక్కు. —లోకమాన్య బాలగంగాధర తిలక్.

కర్తవ్యములు లేని వానికి హక్కులు లేవు అనగా హక్కులన్నియు కర్తవ్య నిర్వహణ నుండి ఆవిర్భవించును. —గాంధీజీ.

## 102. హేతువాదం

ప్రయోజనంపోయి, ఇంకా సెంటిమెంట్ల వల్ల అలసత్వంవల్ల పట్టుకు వేళ్ళాడే బూజుల్ని మాత్రమే దులపగలం హేతువాదనతో, హేళనతో. —చలం.

వేదవాక్యమైన విజ్ఞాని మెచ్చడు
హేతురహితమైన రీతినున్న ;
గ్రుడ్డి నమ్మకాలు గొడ్లకే చెల్లురా. —నార్ల వెంకటేశ్వరరావు.

మానవుడు ప్రాయికంగా, వస్తుతః హేతువాది. ప్రతి మానవుడి ప్రవర్తన ఎంత అహేతుకంగా కనిపించినా చివరికది హేతుబద్ధంగా ఉద్దిష్టమైనదే అవుతుంది. —యం.యన్. రాయ్.

అతి దారిద్ర్యంగాని, అతిసౌభాగ్య స్థితిగాని హేతువాదాన్ని వినవు. —ఫీల్డింగ్.



హేతువాదమన్న సేతువులేకున్న
నరుడు దాటనేర్వడిరుల వాగు ;
భీతిగొలుపు బ్రతుకు హేతుబద్ధముగాక —నార్ల వెంకటేశ్వరరావు.

## 103. క్షమ

క్షమ బ్రహ్మ, క్షమ సత్యం, క్షమగతం. క్షమ భవిష్యత్తు. క్షమ తపస్సు, క్షమ పవిత్రత. యావత్ప్రపంచాన్ని ఈ క్షమ ధరిస్తున్నది. —వ్యాసుడు.

వివేకవంతుడెప్పుడూ క్షమార్పణ కోరడు. —ఎమర్సన్.

శత్రువును క్షమించడం అతన్ని జయించడమే. —హజరత్ అలీ.

క్షమకు ప్రేమతోడ సంబంధమున్నది ;
ప్రేమబట్టి క్షమయు పెరుగుచుండు ;
చిలుకలేదె క్షమను సిలువనుండియు క్రీస్తు ? —నార్ల వెంకటేశ్వరరావు

క్షమ కవచంబు క్రోధమిది శత్రువు జ్ఞాతిహుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు దారుణ పన్నగముల్ సువిద్య వి
త్తము చితలజ్జ భూషణముదాత్త కవిత్వము రాజ్యమీక్షమా
ప్రముఖ పదార్థముల్ గలుగు పట్టునఁదత్కవచాదులేటికిన్ ? —భర్తృహరి.

...*...